## స్వగతం

అతిథివోలె వుండి వుండి
అవని విడిచి వెళ్ళుతాను
పల్లె పట్టణంబులనక
పల్లేరై తిరిగినాను
మురికి నీటి నడుమవున్న
ఇరుకులలో ఇరికినాను
కూటి పేద తన కబళము
నోటికీయ గుడిచినాను
పూలవాసనలు నిండిన
పాలరాతి మేడలలో
ఆయాసము కలిగించెడి
పాయసాలు మెక్కినాను
వాయువుతో పోటీపడు
వాహనాలు ఎక్కినాను
కంటకాల మధ్యనేను
కాలినడక నడిచినాను
కాలు బైట పెట్టకుండ
కాలమెంతొ గడిపినాను
గుట్టలపై ఎక్కి ఎక్కి
గట్టుల దిగజారినాను
లోయలలో దూకి దూకి
లోతులెన్నొ చూసినాను
నేపాకని ఎత్తులేదు
నేజారని లోతులేదు
మూలజేరి మునులవోలె
మూగనోము బట్టినాను
ఈగవోలె దోమవోలె
వాగుచు తిరుగాడినాను
అతిథివోలె వుండి వుండి
అవని విడిచి వెళ్ళుతాను

# కాళోజీ కథలు



కాళోజీ కథలు

© రచయిత

ప్రచురణలు: కాళోజీ ఫౌండేషన్

మొదటి ప్రచురణ : 2000
ప్రతులు : 1000

రెండవ ప్రచురణ : 2011
ప్రతులు : 1000

వెల రూ. 50/-

ప్రతులు:
కాళోజీ ఫౌండేషన్
2-5-311, నక్కలగుట్ట,
హనుమకొండ-506001.

మరియు ముఖ్యపుస్తక విక్రయ కేంద్రాలు

ప్రింటింగ్
దీప్తి ప్రింటర్స్
హనుమకొండ

## మాట....

ఎక్కడెక్కడో ఉన్న కాళోజీ కథల్ని సేకరించి డిసెంబరు 2000లో 'కాళోజీ కథలు' పేరిట కాళోజీ ఫౌండేషన్ తరపున వరవరరావు గారు అచ్చువేశారు. ఆనాటి పుస్తకాలన్నీ అయిపోయినాయి. చాలమంది పుస్తకాలకోసం అడుగుతున్నారు. పరిశోధక విద్యార్థులు కొందరు కూడా. కాపీలు లేక జిరాక్సు తీసుకుంటున్నారు. పదేండ్ల తర్వాత మళ్ళీ కాళోజీ కథల్ని అచ్చువేస్తున్నాం.

వీర తెలంగాణలో 'కాళోజీ కథల మంజూష' అని వి. ఆర్.విద్యార్థి రాసిన వ్యాసాన్ని, చివర అదనంగా వేస్తున్నాం అంతే తేడా.

కాళోజీ కథలు మొదట్లో అచ్చువేసిన ప్రాతఃస్మరణీయుడు వట్టికోట ఆళ్వారుస్వామినీ, తెలంగాణ వైతాళికుడు సురవరం ప్రతాపరెడ్డినీ, అప్పట్లో కథలు అచ్చువేసిన పత్రికల సంపాదకుల్నీ స్మరించటం మా ధర్మంగా భావిస్తున్నాం. 2000లో అచ్చువేసిన వరవరరావు గారికి మా కృతజ్ఞతలు.

ఈసారి కథల పుస్తకాన్ని మళ్ళీ అచ్చు వేయటానికి ఆర్థిక సహాయాన్ని అందించిన నాగిళ్ళ రాకేశ్‌కు కృతజ్ఞతలు.

పుస్తకాన్ని అందంగా ముద్రించిన దీప్తి ప్రింటర్స్, హనుమకొండ అధినేత శ్రీ కృష్ణ గారికి మరియు సిబ్బందికీ కృతజ్ఞతలు.

సెప్టెంబరు 2011 — కాళోజీ ఫౌండేషన్
హన్మకొండ. — వరంగల్లు.

## కాళోజీ - కథ

మనదేశంలో ఒక వైవిధ్యంగల సమాజం బ్రాహ్మణీయ భూస్వామ్య నిరంతర వ్యవస్థవల్ల అణగారిన ప్రజాస్వామ్య సంస్కృతి మేల్కొనకముందే వలసపాలనకు లోనైంది. వలసపాలన తొలగిన దగ్గర్నించీ మనకు వచ్చిన స్వాతంత్ర్యం సామ్రాజ్యవాద సంస్కృతిని అనుకరించడానికి తప్ప పాలకుల పుణ్యమా అని ప్రతిఘటించడానికి పనికి రాలేదు. ఇప్పుడయితే ఇంక అమెరికా వైపు అర్రులు జాపి చూసే మార్కెటు సంస్కృతి మన మధ్యతరగతి మూల్గులలో, నరనరాన జీర్ణించుకపోయింది.

ఈ మానసికస్థితిలో కాళోజీ వంటి వాళ్ళను అర్థం చేసుకోవడం పూర్తిగా సాధ్యమయ్యేపని కాదు. ప్రజలమనిషి అని, ప్రజాకవి అని నిజంగా ఈ దేశంలో మౌలిక స్వతంత్ర ప్రజల ఆకాంక్షల ప్రతినిధిగానే ఆయనను పిలుచుకుంటున్నామా, అలవాటుగా పిలుచుకుంటున్నామా? ఒక పేరు, ఒక ఇంటి పేరు ఆనవాయితీగా తగిలించి పిలుచుకున్నట్లుగానే, నైజాం కాలంలో పుట్టి ఆర్యసమాజం, ఆంధ్రమహాసభ ఉద్యమాల్లో పెరిగి తెలంగాణా గొడవను నాగొడవగా కనీసం డెబ్బై ఏళ్ళుగా అలసటలేకుండా ఎలుగెత్తి చాటుతున్న కాళోజీ-ఎన్నడూ నామమాత్ర ప్రజాస్వామ్య పరిపాలన కూడా చవిచూడని నిజాం, హైదరాబాదు రాష్ట్రాల్లో, ఆంధ్రప్రదేశ్‌లో అంత అపూర్వమైన ప్రజాస్వామ్య సంస్కృతిని ఎట్లా ఒంటబట్టించుకున్నట్లు? ఇది అర్థం కావాలంటే మేధావులను, రచయితలను, నాయకులను, సిద్ధాంతకర్తలను చూస్తేకాదు, ప్రజలను చూడాలి. తెలంగాణాలో జీవితానుభవం, వివేకం ఉన్న ఒక సగటు మనిషిని చూడాలి. కాళోజీ 'నాగొడవ' అర్థం కావాలంటే ఆ మంది గొడవ వినాలి. అయినా కాళోజీలో అర్థంకాపోవడానికి ఏమీ లేదు. ఒంటిమీద కప్పుకోవడానికి ఏమీలేని మనిషి, దాచుకోవడానికి ఏమీ లేనట్లు కాళోజీ గొడవే తప్ప గోప్యం తెలియని మనిషి. ఆయనకు సాహిత్యం పట్ల ఉన్న దృక్పథం ప్రాచీన ఆదివాసీ సామూహిక చైతన్యం వంటిది. సరుకులమాయలో పడిన మనకది అర్థంకావడం కష్టం. పశువు పెండ పెడితే అలుకుకే తీసుకుంటారో, పిడకలకే తీసుకుంటారో, ఎరువుకే తీసుకుంటారో - తీసుకునేవాళ్ళ అవసరం, ఇష్టం. ఇంక దానిమీద నాకేం హక్కు ఉంది అంటాడు. ఏదైనా రాస్తే, ఒక్క పత్రికకే ఇవ్వాలికదా అంటే - మరి ప్రకటనలు అన్ని పత్రికలకు ఎందుకిస్తున్నవు. సభ పెడితే వార్త అన్ని

పత్రికల్లో రావాలని చూస్తావు కదా. నీ సృజనాత్మక రచన నీ భావప్రకటన కాదా అంటాడు. వ్యక్తిగత ఆస్తి భావజాలం నుంచి వచ్చిన కాపీరైటు, పేటెంటు హక్కులు– కాళోజీకి అర్థం కావు. ఆయన లా చదివి, న్యాయవాద వృత్తి చేపట్టకుండా ప్రవృత్తివల్ల ఇప్పటికీ ఒక సామూహిక ప్రవక్తగా – వేమన వలె స్వతంత్రంగా జీవిస్తున్నాడు.

మాట ఆయన దృష్టిలో ఒక భావ ప్రకటన, సంభాషణ, సంవాదం, సందేశం, రచన, ప్రసంగం – దాని ప్రక్రియ రూపమేదైనా – మనసులోని మాట చెప్పడమే. ఆ మాట రంగు, రుచి వాసనలకంటే దాని ఉద్దిష్ట ప్రయోజనం మీద ఆయన యావ. మనిషికి మనిషికన్నా, మనిషి మాట ఎదుటి మనిషికన్నా అర్థం చేయించవలసిన అవసరం ఇంకేం ఉంటుంది అనే శరీరభాష ఆయన.

ఎదుటివారికి కాళోజీగొడవ అర్థంకాకపోతే ఇంక నీ వ్యాఖ్యానం మాత్రం ఏ అర్థమవుతుంది –అని విసుక్కుంటాడాయన. మనుషుల గ్రహణ, అవగాహనశక్తుల మీద అపారమైన విశ్వాసం ఉంటే తప్ప కాళోజీ వలె సూటిగా ఆలోచించడం సాధ్యం కాదు. మన సాహిత్య విమర్శకులు కొందరు 80లలో వచ్చిన కవిత్వాన్ని అంచనా వేయగలిగే సాహిత్యవిమర్శ రాలేదని, ఆధునికోత్తర భావాలను అంచనావేయగల సాహిత్యవిమర్శ రాలేదని, పరిపరివిధాల వాపోతున్నారు గానీ, కాళోజీ వ్యక్తిత్వాన్ని, సాహిత్యాన్ని తూచగల లవ్‌లర్నింగ్ ప్రాసెస్ మన సాహిత్య విమర్శ అలవరచుకోలేకపోతున్నది. అయితే రాజకీయాల నుంచి సాహిత్యం దాకా అన్నింటినీ బలాదూర్ చేయగల ప్రజాకీయ దైనందిన ఆచరణవల్ల, ఆ ఆచరణను సాధ్యంచేసిన ఆయన నిండు జీవితం వల్ల – కాళోజీకి ప్రజలకు తనకు మధ్యన దలాల్‌ల అవసరంలేకుండా పోయింది. యువతరానికి, ఆయనకు మధ్యన ఆయన సంభాషణయే ఒక నిత్యయవ్వన సంధానమైంది. ఆయన ఒక ప్రత్యక్ష మానవుడు.

ఇటువంటి డొంకతిరుగుళ్ళు కాళోజీకి ఇష్టం ఉండవుగనుక ఇంక ఆయన కథల్లో ప్రవేశిద్దాం. కాళోజీ కథలు రాసాడని ఈ తరానికే కాదు, నిన్నటి తరానికి కూడ తెలియకపోవచ్చు. ఆయన కథలైనా, కథానువాదాలైనా దాదాపుగా 1937–47 మధ్యకాలంలో చేసాడు. అంటే ఇంకా బ్రిటిష్‌వాడు, నిజాం రాజు గద్దెదిగకముందే. ఆ తర్వాత ఇంక కథలరూపంలో పశువుమీదనో, పక్షిమీదనో పెట్టికాకుండా, గింజమీదనో, కోతిమీదనో పెట్టికాకుండా ప్రత్యక్షంగా మనుషుల గురించి మాట్లాడుకునే స్వతంత్రం వస్తుందిగదా – అనుకున్నట్లున్నాడు.

13వ ఆగష్టు 15 స్వాతంత్ర్యం గురించి 1959లో రాసినా, ఎన్నికల గురించి రాసిన సశేషరచనలోనయినా ఆయన ఆశాభంగం మనకర్థమవుతూనే ఉంది.



కాళోజీని ఒక ఏభై ఏళ్ళ తర్వాత ఇవ్వాళ కథకునిగా పరిచయం చేయకపోతే ఆయనకొచ్చే నష్టం ఏమీలేదు. ఆయన బహుముఖీన వైవిధ్య వ్యక్తిత్వం మనకింకొక కోణంగా తెరచుకొని మన వికాసానికి తోడ్పడడం తప్ప ఆయనకు వచ్చే కిరీటం ఏమీలేదు. జీవితమంతా రాజకీయాల్లోనే కాదు సాహిత్యంలోనూ ఆధిపత్య కిరీటాలను పడగొట్టడమే ఆయన పితూరీ లక్ష్యం.

63 సంవత్సరాలకన్నా పూర్వం ఆయన వెల్దుర్తి మాణిక్యరావు, అవధానిలతో కలిసి రాసిన చిన్నకథ 'భూతదయ'కు అప్పటి ప్రేరణలేమిటో కానీ లాల్‌కృష్ణ అద్వానీలు, సంఘ్‌పరివార్‌లు – వాళ్ళు మాత్రమేకాదు,ఆ భావజాలం ఒక జాతి సంస్కృతి అనుకునేవాళ్ళు చదువుకొని సిగ్గుపడవలసిన కథ ఇది. కాళోజీ క్రాంతి దర్శిత్వానికి ఈ కథ ఎంత దాఖలాయో, మన అమానవీయ సాంస్కృతిక మాలిన్యం ఇంకా పేరుకపోతున్నదనడానికి అంతకన్నా విషాదమైన నిదర్శనం. ఈ కథకు ఇపుడున్నంత సమకాలీనత ఆయన రాసిననాడు ఉండి ఉండదు – కనీసం తెలంగాణలో.

ఒకటి తప్ప ఆయన అనువాదానికెంచుకున్న కథలన్నీ మరాఠీవే. అది ఆయన మాతృభాష కూడా. 'రెండు గింజలు' వంటి కథ ఆనాడే కాదు ఈనాటికీ ప్రాణికి జీవధాతువుపై ఉండే ఒక సజీవ ఆకర్షణకు, ఆశావాదానికి, కాళోజీ తత్వానికి అద్దంపడుతుంది. భవిష్యత్తుపై గొప్ప భరోసానిస్తుంది.

కాళోజీకి జీవితంపట్ల చాలప్రేమ ఉన్నందువల్ల మృత్యువుపట్ల ఒక తాత్విక దృక్పథం ఉన్నది. జీవితానికి సంబంధించిన ఒక విలువనో, స్నేహానికి సంబంధించిన ఒక సెంటిమెంటునో చెప్పినపుడు ఆయన వలవల ఏడుస్తాడు. మంచితనం గురించి కన్నీళ్ళతో తడవనిమాట ఆయన నోటరాదు. కాని మృత్యువు దగ్గర– తప్పకుండా పరామర్శించి శవం దగ్గర ఒక జానపద కళాకారునివలె 'జాతస్యమరణం ధృవం' కథలు చెప్తుంటాడు. డాక్టర్ రామనాథం మృతదేహం దగ్గర రజాకార్లు చంపిన డాక్టర్ నారాయణరెడ్డి కథ కావచ్చు. ఎర్రంరెడ్డి సంతోష్‌రెడ్డి శవందగ్గర దొడ్డికొమురయ్యదో, మొగిలయ్యదో ఊరేగింపు కావచ్చు. ఒక ఎనభై ఏడేళ్ళ అపారజీవితానుభవం కదా. సంతోష్ చితికి నిప్పుపెట్టి, తాత్వికంగా–వాడు పెట్టాలి కదా నాకు తలకొరివి. నేనింకా ఎట్లా ఎందరు యువకులకు తలకొరివి పెట్టాలో గదా – ఈ తెలంగాణాలో అంటాడు. ఏడాది తిరిగాక అదే కడివెండిలో అతని ఇరవై అడుగుల స్థూపాన్ని ఆవిష్కరించి – ఇది మాత్రం కూల్చరని ఏమిటి గ్యారంటీ – అంటాడు. మనుషులు పోతారు. వాళ్ళ స్మృతిచిహ్నాలు పోతాయి. ముఖ్యంగా

అవి జీవితాన్ని, పోరాటాన్ని గుర్తుచేసేవయితే నీడలకు భయపడే శత్రువు వాటన్నింటినీ తుడిచిపెట్టేస్తాడు. కాని భూమి, గాలి, రాత్రిందినాలు, సూర్యుడు, చంద్రుడు, కాళోజీ వంటి మనుషులు - ఒక సంప్రదాయంగా, ఒక సంస్కృతిగా కొనసాగుతుంటారు. అరవైఏళ్ళ క్రితం 'రెండుగింజలు' కథ మరాఠీనుంచి అనుసృజనకోసం కాళోజీ ఎంచుకున్నాడంటే ఇదిగో ఇట్లా గింజలు రాలిపోయినంత మాత్రాన, పిట్టనోట, ఆ పిట్ట గద్దనోట పడి నేలరాలినంత మాత్రాన - జీవితం ముగిసినట్లు కాదు. అక్కడ విత్తనం చెట్టయి ఫలవంతమవుతుంది.

***

1998 మార్చ్‌లో కాకతీయ యూనివర్సిటీ తెలుగు డిపార్ట్‌మెంట్ మొదటిసారిగా తెలంగాణా సాహిత్యం మీద యుజిసి సహాయంతో ఒక సెమినార్ నిర్వహించింది. దానికి కాళోజీ గౌరవ అతిథి. పేర్వారం జగన్నాథంగారు ముఖ్య అతిథి. ఆయన తెలంగాణా సాహిత్యం గురించి మాట్లాడుతూ ఎక్కువగా కాళోజీ గురించే మాట్లాడారు. అందులోనూ ఈ తరానికి కాళోజీగురించి తక్కువగా తెలిసిన కథకుణ్ణి పరిచయం చేస్తానని 'మనమే నయం', 'లంకా పునరుద్ధరణం' వంటి కతలు చెప్పి, అవి సమకాలీన పరిస్థితులకు అన్వయిస్తూ, తన దగ్గర అపూర్వంగా దాచుకున్న 'అణాగ్రంథమాల' వారి 'కాళోజీ కథలు' పుస్తకం తీసి సభకు చూపారు. 'అణాగ్రంథమాల' వారి అరుదైన సేవల గురించి చెప్పారు. అప్పటిది కాళోజీ కథలు మళ్ళీ వేయాలన్న ఆలోచన, రెండున్నర సంవత్సరాలు గడిచిపోయింది. కాళోజీ రామేశ్వరరావుగారు మరణించినప్పటినుంచీ కాళోజీ ఏదో పోగొట్టుకున్నట్లు ఉంటున్నారని సన్నిహితులందరికీ తెలుసు. కాళోజీ ఏభై ఏళ్ళ నుంచే ఒంటి ఊపిరి మనిషి అని, క్షయగ్రస్తుడయినందువల్ల ఒక ఊపిరితిత్తి తీసివేసారని కూడ ఆయన తెలిసిన అందరికీ తెలుసు. ఆసుపత్రిలోనే డాక్టర్లు 'మాట్లాడవద్దు, మాట్లాడితే ఆరునెలల్లో చచ్చిపోతావ'ని చెప్తే 'మాట్లాడకుంటే ఇప్పుడే చచ్చిపోతాన'న్న సందడి మనిషి ఆయన. కానీ రామేశ్వరరావుగారు మరణించాక ఆయన తన వయసు లెక్క పెట్టుకుంటున్నాడు. తన 87వ జన్మదినం సందర్భంగా Still I have will to live and question (ఇప్పటికీ నాకు జీవించాలని, ప్రశ్నించాలని సంకల్పం ఉన్నది. ఆ సంకల్పం ఎన్నటికీ చావదు) అని చెప్తూనే - నా మనసులోని ఆసక్తికి, నా అవయవాల గల శక్తికి 'కట్టడి', 'అమలు' కుదరక కొట్టుకు చస్తున్నా. మెట్టుకు నెట్టుకవస్తున్నా - అని మనసుకు సహకరించని శరీరసంధ్య మీద జాలిచూపాడు.

ఆయన నిలబడి నీళ్ళు తాగాలి గానీ పరుగెత్తి పాలు తాగొద్దని ఉద్యమాల్లోని



యువకులకు చెప్తుంటారు. ఏ పనీ మనసుకూ శరీరానికి కష్టం కాకుండా ఇష్టంగా చేయాలంటాడు. అయినా సరే సాహిత్యంలో రామశాస్త్రి, రాజకీయాల్లో ప్రభాకర్ వంటి జాన్సన్‌కు బాస్వెల్‌ను పోలిన నిస్వార్థ అభిమానులు ఉండి కూడ ఈ పుస్తకం ఆలస్యమే అయింది. ఇదీ ఒకరంగా కాళోజీ తత్వానికి, వ్యక్తిత్వానికి, ప్రభావానికి ఒక కాంప్లిమెంటే. ఆయనకు అభిమానులు ఉన్నారు కానీ శిష్యులు లేరు. ఏమైతేనేం కాళోజీ ఈ సంకలనం చూడగలగాలి.

ఆయన కథలన్నీ సేకరించి వేయాలన్న ఆకాంక్ష తప్ప సేకరణ పద్ధతి తెలియకపోవడం వల్ల రెండేళ్ళకు ఒక్క 'అపోహ' అన్న కథ దొరకలేదని ఆగాం. ఆంధ్ర సారస్వతపరిషత్తులో డి. చంద్రశేఖరరెడ్డి, కె.శ్రీనివాస్, జి. శ్రీనివాస్ ప్రయత్నించారు. తెలుగు యూనివర్సిటీలో ఎన్.గోపీ ప్రయత్నించాడు. ఇది మాత్రమే కాదు రెండుగింజలు, ఎన్నిక కథ, భూతదయ - అనే మూడు కథలు ఏనాడో స్వయంగా ఎం. రత్నమాలగారు సేకరించి స్వదస్తూరితో రాసినవి, కాళోజీపై పరిశోధన చేసిన డాక్టర్ మల్లారెడ్డి (బోనగిరి కాలేజ్‌లో తెలుగు లెక్చరర్) గారు తెచ్చి ఇచ్చినారు. రత్నమాల, మల్లారెడ్డి కాళోజీ రచనల సేకరణలో చాల కృషిచేసారని సకాలంలో జ్ఞాపకంరాని మా మతిమరుపుకు నవ్వుకున్నాం. సంగారెడ్డి ప్రభుత్వ జూనియర్ కళాశాలలో లైబ్రేరియన్ సంగిశెట్టి శ్రీనివాస్‌గారు, కాళోజీ, వట్టికోట ఆళ్వారుస్వామి వంటి తెలంగాణా వైతాళికుల రచనలు చాల భద్రపరిచారు. ఆయన 'అనుభవంలేని ఆందోళన', 'జాజి తీగె' కథలు సేకరించి కె. శ్రీనివాస్ ద్వారా అందచేసారు. ఇవి సేకరించడంలోనే కాదు సెప్టెంబర్ 9,2010 నాటికి ఈ కథాసంకలనం తేవాలన్న సంకల్పానికి సహకరించే ఉద్దేశంతో చలసాని ప్రసాద్ కాళోజీతో జూలై 17, 2000న మాట్లాడించాడు. ఈ కథాసంకలనం వెలువడుతున్న సందర్భం కోసం మాట్లాడిందే కనుక 'అరుణతార'లో వచ్చినప్పటికీ ఇందులో కూడ చేరుస్తున్నాం.

అణాగ్రంథమాల స్థాపించి 24వ ప్రచురణగా కాళోజీ కథలు ప్రచురించిన ఆంధ్ర పబ్లిషింగ్ కంపెనీ, సుల్తాన్‌బజార్, హైదరాబాదు - దక్కన్ వారి ఉద్యమకృషి ఇవ్వాళ మనం వెలకట్టలేనిది. 'పరిసరాలు' కథా సంకలనాలు రెండుసంపుటాలు తెచ్చిన వట్టికోట ఆళ్వారుస్వామి గారి దేశోద్ధారక గ్రంథమాల, గోల్కొండ పత్రిక, తెలుగుతల్లి, శోభ, ఆంధ్రకేసరి - అన్నీ ప్రాతఃస్మరణీయాలే.

15 ఏళ్ళ క్రితం జూలై 17వ తేదీనే (1985) కాళోజీ నాయకత్వంలో వందమందికిపైగా రచయితలు రాజ్యహింసకు వ్యతిరేకంగా విరసం పూనికతో ఒక

రాష్ట్రవ్యాప్త సంతకాల సేకరణ, ఉద్యమం నిర్వహించి హైదరాబాదులో సభ నిర్వహించారు. జూలై 18 ఉదయం కృష్ణా ఎక్స్‌ప్రెస్‌లో హనుమకొండకు తిరిగిపోతూ పత్రికల్లో కారంచేడులో దళితులపై దాడి గురించి చదువుకున్నా. 15 ఏళ్ళ తర్వాత యాదృచ్ఛికంగా అదేరోజు కాళోజీ అంతకన్నా బీభత్సంగా మారిన హింసావ్యవస్థ గురించి ఆవేదన, ఆగ్రహం కలగలసిన గొడవ కలబోసుకుంటున్నారు.

అందుకే కాళోజీ 'నాగొడవ' మన గొడవ. కాళోజీ తెలుగుజాతి 87 ఏళ్ళ సంచలన జీవితానికి నిలువుటద్దం. తెలుగుజాతి అన్నపుడు – అది 'ఆంధ్రుల ఆత్మగౌరవం' అనే ఒక పడికట్టుమాట వంటిది కాదు. కుల, లింగ, మత, వర్గ, ప్రాంత వివక్షకు గురయి పీడనకు, అణచివేతకు, దోపిడీకి వ్యతిరేకంగా – బానిస వ్యవస్థకు వ్యతిరేకంగా స్పార్టకస్ వలె, 'నీబాంచెన్ దొరా' వ్యవస్థకు వ్యతిరేకంగా తెలంగాణా కట్టుబానిస వలె ఆకాశంలో గద్దకు వ్యతిరేకంగా తల్లికోడి వలె, నిర్నిద్రపోరాటం చేస్తున్న కాళోజీ మన కళ్ళముందు నడుస్తున్న చరిత్ర.

హైదరాబాదు, డిసెంబర్ 4, 2000 – వరవరరావు



## కథా క్రమం

# కాళోజీ నా గొడవ

ఆకలికి అన్నము దొరికినదె చాలు
అడుక్కొని తింటేమి?......

అన్నిటికి మూలం అన్నం. ఎన్నడయినా అంతే, ఎక్కడయినా అంతే. ఇవ్వాళ అడుక్కుతిందామంటే అమ్మలూ లేరు, పెట్టే అత్తలూ లేరు. "కొందరికే తినమస్తు, మస్తుమందికి పస్తు". ఈ మస్తుమంది నోటికందకుండ ఈ అన్నమంత ఎటుపోతున్నది?

ఇక్కడ నా చిన్నప్పుడు విన్న కథ యాదికొస్తున్నది –

మూడు దుడ్డెలు మేతకు పోయినయి. ఒకటి బాపనివాండ్ల దుడ్డె. ఒకటి కాపువాండ్లది. ఇంకొకటి వ్యాపారస్తుడిది. అవి మేతమేసినాంక, మూడూ పోయి వాగులనీళ్ళు తాగినయి. బాపనదుడ్డె అన్నదిగదా "ఆహా వాగునీళ్ళు అమృతం వతు తియ్యగ ఉన్నయి" అని. కాపువాని దుడ్డె అది విని "అమృతందేమున్నది? మా అమ్మ చన్నుపాలు ఇంకా తియ్యగుంటయి" అన్నది. వ్యాపారి దుడ్డె అదివిని "అట్లనా! అమ్మ చన్నులో పాలు ఉంటయా?" అన్నది. ఇదంతా విని బాపనిదుడ్డె – "అమ్మకు చన్నుగూడ ఉంటదా?" అన్నది – దీంట్ల సంగతి ఏమిడిదంటె – ఒకడేమొ, దుడ్డెకు పాలు దక్కనిస్తడు. ఇంకొకడేమొ, చన్ను నోటికందనిస్తడు గాని ముందే పాలన్ని పిండుకుంటడు. ఇంకొకడు ఆ చన్నుకూడ నోటికందనీయడు. ఆ చన్నులున్న జ్ఞానమే – తెలివిడే – దానికి కలగనీయడు. తెలిస్తె ప్రమాదం గదా! అడుగుతది గద. అట్ల గద్దెలెక్కి కూచున్న పాలకులే మస్తుమందిని పస్తుపెట్టి వాండ్ల అన్నాన్ని కాజేస్తున్నరు.

ఇవాళ ప్రతిదీ రాజకీయం ఐంది. కాని ప్రభుత్వం లేదా పాలకులు మాత్రం ప్రజలకు రాజకీయాలు వద్దంటరు. విద్యార్థులూ మీరు చదువుకొండ్రి. మీకు రాజకీయాలెందుకు? పంతుళ్ళూ మీరు పాఠాలు చెప్పుకోండ్రి. మీకు రాజకీయాలెందుకు. ఉద్యోగులూ మీకూ రాజకీయాలెందుకు. మీరు ఉద్యోగాలు చేసుకొండ్రి. ఇది ఇవాళగాదు, ఇందిరాగాంధీ నాటినుంచి ఇవ్వాళటివరకు అందరు పాలకులు, రాజకీయనాయకులు చెప్తున్నమాటే. మరి అయితే రాజకీయాలు ఎవరికిగావాలె? నాయకులకేనా? అన్నీ సరిగ్గా జరుగుతే, ఎట్ల నడవాల్నో అట్లా

నడుస్తె మంచిదే. ఎవ్వడూ మాట్లాడవలసిన పనిలేదు. ఏది ఉండవలసిన విధంగా లేదు. అందుకే పాలకులను అడగవలసి వస్తున్నది. రాజకీయాలు వద్దంటెట్ల? పాలకులెప్పుడూ ప్రజలకు అన్నీ తెలువద్దు అనుకుంటారు. "తెలివి ప్రమాదం ప్రళయం". 'తెలివి తెచ్చుకొని అడగాలె' అని మనకు అనిపించకుండ చూసుడే ప్రభుత్వాలు చేస్తున్నయి. మొన్నటి తెల్ల వాడైనా, నిన్నటి నిజామైనా కనీసం వాండ్లేం చేస్తున్నారో చెప్పెటోండ్లు. మనకూ తెలిసేది. తప్పనిపిస్తే అడిగేటోళ్ళం – మీరడిగేది మీరడుగుండ్రి. మేం చేసేది మే చేస్తం. మాకు చేటు చేసే పనులు చేస్తే ఊరుకోం అని సాఫ్గ చెప్పేటోళ్ళు. మనం కొట్లాడేటోళ్ళం. కాని ఇవ్వాళ పరిస్థితి అట్లలేదు. ఇదేంది అని అడిగేటోని నోరు బలవంతంగా మూయిస్తున్నరు.

ఆనాటి ప్రభుత్వాన్ని ఆనాడు అడిగిన. ఇవ్వాల్టి ప్రభుత్వాన్ని ఈనాడు అడుగుతున్న. ఎప్పుడూ అడుగుకుండ ఉండలేను. లేను. అన్యాయంచేస్తే ఎవ్వణ్ణైనా అంట. కొందరు "ఏంది కాళన్నా, ఎప్పుడూ ప్రభుత్వాలనే, పోలీసోళ్ళనే అంటవు?" అని అంటరు. దానికి నా జవాబు ఏందంటే ప్రభుత్వం అనేది బాధ్యతగలిగి ప్రవర్తించాలె. ఎవడైనా తప్పుచేస్తే చట్టబద్ధంగా విచారణ – కోర్టులల్ల విచారణ చేయించి శిక్ష పడేటట్టు చేయాలె. జైళ్ళ కూడా పెట్టాలె కోర్టు ఆర్డరిస్తె. కాని చట్టానికి అతీతంగా విచారణ గిన ఏం లేకుండ చంపి "కిల్డ్ ఇన్ ఎన్‌కౌంటర్" అంటె ఎట్ల. ఏ నేరస్తుణ్ణీ విచారణ లేకుండా విడిచిపెట్టాలె అని నేనెన్నడూ అనలేదు. కాని వాడు నేరంచేయడానికి దారితీసిన పరిస్థితుల్ని మార్చవలసిన బాధ్యత పాలకులది అవునా కాదా! ఘరానా నేరాలు చేసిన వాండ్లు తప్పించుకున్నరు. "చెల్లినోనికి నేరం చెల్లుబాటు అవుతుంటే, చెల్లనోనికి నేరం చేయక తప్పక వుంటే, చట్టవిరుద్ధం చర్యల పుట్టైపోదా దేశం?" అని ప్రశ్నిస్తున్న. ప్రభుత్వం చేసే హింస పర్వతమంతయితె, ప్రైవేటుహింస వెంట్రుకంత. అంగబలం, అర్థబలం ఉన్న ప్రభుత్వమే ప్రైవేటుహింసను ఎదుర్కొనడానికి భయపడ్తే ఎట్ల? మళ్ళ గదే – "సామాన్యప్రజలకు చైతన్యమొదవ చతురంగబలముండ జంకేల రాజా" అని నిజామునడిగిన. ప్రజలు చైతన్యవంతులై ప్రశ్నిస్తరని భయం. ఎంతసేపటికీ వాండ్లు చైతన్యవంతులు గాకుండా చూసుడే పని ప్రభుత్వానికి.

ఇక్కడింకో సంగతి. ప్రభుత్వం తప్పుచేస్తే అది పబ్లిక్‌రాంగ్ అయితది. ప్రైవేట్ రాంగ్ కాదు. ప్రభుత్వ రాంగ్‌ను సీరియస్‌గా తీసుకోవాలె. లిన్‌యుటాంగ్ అనే రచయిత "On the Importance of Living" అన్న తన పుస్తకంల – ఐదువేల



ఏండ్లకింద ఒక చైనీస్ తత్త్వవేత్త చెప్పినమాటగా ఇట్లన్నడు "A private wrong can be drowned in a cup of wine, but a public wrong requires a river of blood" అని. ఇది అందరూ బాగా ఆలోచించవలసిన విషయం.

హింస అహింస విషయంలో క్లుప్తంగ చెప్పవలసివస్తే నాగొడవలో ఎప్పుడోచెప్పిన ఇదివరకే –

*"హింస తప్పు*
*రాజ్యహింస మరీ తప్పు*
*ప్రతిహింస తప్పుగాదు"*

అందరి ఆలోచనలు ఒక్కతీరుగ ఉండవు. ఎవని ఆలోచనలు వాణ్ణి చెప్పనీయాలె. ఓట్లు వేసుకునేటోళ్ళను వేసుకోనియ్యాలె. ఓట్లు వేయొద్దని చెప్పుకునేటోళ్ళను చెప్పుకుంటే చెప్పుకోమను. చెప్పుకునే స్వేచ్ఛ వాండ్లకున్నది. వేసుకునే స్వేచ్ఛ వీండ్లకున్నది. ఓట్ల సంగతి అయినాంకనయినా కలిసి పనిచేయవచ్చుగదా?

అన్యాయాన్ని అందరూ కలిసి ఎదిరించాలె. ఆలోచనలల్ల తేడా ఉన్నంతమాత్రాన కలిసి పనిచేయొద్దని లేదు గద? ఆమధ్య గోదావరిఖనిలో కరీంనగర్ జిల్లా అమరవీరుల సంస్మరణసభకు పోయిన. ఆనాడు, ఆ సభకు సంబంధించిన పదకొండుమంది అమరవీరుల్లో ఎనిమిదిమంది విప్లవపార్టీల మధ్య తగాదాల చంపబడ్డవాళ్ళే. అది నాకు ముందర తెల్వదు. తెల్సినా పోయేటోన్నే అనుకొండి. అక్కడ నేను చెప్పేది నేను చెప్పిన. అందుకే ఆలోచనలల్ల తేడా వున్నా కలిసి పనిచేయవచ్చు గదా అంటున్న.

అట్లనే ఒకళ్ళు ఎక్కువ ఒకళ్ళు తక్కువ అనేమాట పోవాలె. అది రావడానికి ఆటంకాలు చానా ఉన్నాయి. ప్రజలను మోసం చేసుట్ల ఎవ్వరేం తక్కువలేరు.

ఒకడేమో "నా విష్ణుః పృథ్వీపతి". దేవుడుకాంది రాజు కాలేడు – అంటడు. ఇంకోడు 'Devine right of king' - రాజ్యాధికారం దైవికమైందంటడు, మరొకడేమొ "జిల్ అల్లాహ్" అంటడు. దేవుని నీడే రాజు అని. అందరూ రాజును దేవునితో ముడిపెట్టి, రాజు చేసే పనివిషయంలో ఎవ్వరూ ప్రశ్నించేవీలులేదనే వాండ్లే. ఈ ప్రశ్నించొద్దు అనేది పోయి ప్రశ్నించడం తప్పనిసరి కావాలె.

మన ఆలోచనలను ప్రకటించడానికి భాష అవసరం. ఆ భాష రెండుతీర్లు. ఒకటి బడిపలుకుల భాష. రెండోది పలుకుబళ్ళ భాష. నాది పలుకుబళ్ళ భాష. ఎక్కడయినా పలుకుబళ్ళ భాష కావాలె. పలుకుబళ్ళ భాషయితే అవతలోనికి తెలుస్తది. భాష గురించి నేను చెప్పేదిదే.

రోమారోలా, సాహిత్యం గురించి ఓ మాట అంటడు "If there is clash between art and truth, I stand by truth" అని. నామాట కూడా అదే. కవిత్వం చెప్పినా, సమాజంపట్ల మనకు బాధ్యత ఉన్నదిగద. అన్యాయం జరిగితే అడగకుండ వుండలేను. వుండలేను – నాకిప్పుడు 86 ఏండ్లు. Still have will to live and question ఆ will ఎన్నటికీ చావదు.

అయితే,

నా మనసులోని ఆసక్తికి
నా అవయవాల గలశక్తికి
'కట్టడి', 'అమలు' కుదరక కొట్టుకుచస్తున్నా
మెట్టుకు నెట్టుకవస్తున్నా

హైదరాబాద్
జులై 17,2010

❋❋❋



# భూత దయ

వెల్దుర్తి, అవధానిలతో కలిసి

ఉషాదేవి ఇప్పుడిప్పుడే ముస్తాబైతూ ఉంది సూర్యుణ్ణి ఆహ్వానించాలని. ఆ వూళ్ళో రామమందిరపు ఆవరణలో జనం గుంపులుగుంపులుగా మూగసాగినారు. మండపం దగ్గర అప్పుడే పుట్టిన శిశువొకటి చలికి గడగడ వణుకుతూ ఏడుస్తూ ఉంది. స్త్రీ పురుషులెందరో వేడుక చూస్తు చుట్టుకున్నారు. మనుష్య ప్రకృతి గొర్రెదాటు లాంటిది. ఎక్కడైనా నలుగురు కూడినారంటే వార్ని చూడ్డానికింకెందరో పోగైతారు. ఒకరినొకరు తీసుకొని పోయి ఆ సంగతేమిటో చూడ్డానికి ప్రయత్నిస్తారు. పూర్తి వివరాలు తెలియకున్నా ఉన్నవి కొన్ని లేనివి కొన్ని కల్పించి కథలల్లటం మనుష్య స్వభావం. అంతవరకే. అసలు కార్యరంగంలోకి దిగుటకొక్కడూ కాలుకదపడు. ఆకాశపురాణాలకందరూ శాస్త్రుల్లే. అప్పుడక్కడ కూడా ఇలాంటి వారిదే మెజారిటీ.

"పాపం ఎవరి పిల్లో"

"ఏ వితంతు పడుచో, ఎదిగిన కన్యో అయి ఉండాలె. ఆమె దుర్వర్తనమే ఇల్లా మూర్తీభవించింది".

"పాపం ఎవరేనా ఎత్తుకొండమ్మా!" అన్నది నడుముకు చెయ్యాన్చి నిలుచున్న ఒకావిడ.

"ఏ పాడుపీనుగో, ఏ జాతివాడో ఎవరికెరుక? గాలికి పోయే కంప మనమెందుకు నెత్తికేసికోవాలె?" జడలో పూలను సర్దుకుండూ పలికిందొక వృద్ధనారి.

ఇల్లా జరుగుతూ వచ్చాయి ప్రసంగాలు.

ఆ శిశువు ఏ పరిస్థితుల్లో పుట్టిందో, పుట్టిందెవరికో, మరి తల్లి పెండ్లి కాని పడుచో ఈడు తిరుగని వితంతువో అని ఇష్టం వచ్చినట్లు వాడుకోసాగింది మూగిన జనం.

అటువైపేద్చి ఏడ్చి కుతికెలు కూర్చున్నప్పటికి ధావంతం మాత్రం ఒక్కరికీ లేదు. ఈదరకు ముద్దగట్టుక పోతూ వున్న ఆ పసికూనను దయావస్త్రంలో దాచటానిక

ఒక్క స్త్రీయైనా ముందుకు రాలేదు. ఒక్క పురుషుడైనా సంసిద్ధత జూపలేదు. ఏ తల్లిక్కూడా ఏడ్చే పాపను చంకకెత్తుకొని ఊరడించాలెననే బుద్ధి పుట్టలేదు.

ఇలా ఎంతసేపో గడిచింది. ఓ రక్షకశాఖాధికారి కూడా ప్రత్యక్షమైనాడు. సంగతులన్నీ తెలిసికొని అక్కడ మూగిన వారినిలా సంబోధించాడు.

"దిక్కులేని ఈ పిల్లవాడికాశ్రయమిచ్చేందుకు మీలో ఎవరైనా సిద్ధంగా ఉన్నారా?"

ఇది విని ప్రతివాడు ఎదుటివాడా పనికి పూనుకోవాలన్న భావం గనపరచే చూపుల్తో చూడసాగారు.

ఆ గుంపులోనుంచెవరైనా ముందుకొస్తారేమో కొంత సేపటిదాకా ఎదురుచూసి,

"ఏమి ఇంతమందిలో ఈ శిశువుకు రక్షణ ఇచ్చే దాతలూ, దయార్ద్ర హృదయులూ ఒక్కరైనా లేరా? చెప్పండి ఎవరూ సంసిద్ధంగా లేరా?" అన్నాడాయన.

సరిగ్గా ఆ సమయానికి ఓ క్రైస్తవ ప్రచారకురాలు తోసుకొచ్చి తానా అర్భకుని పోషకత్వ భారాన్ని వహిస్తున్నానని చెప్పింది. ఇందుకా అధికారి కూడా సమ్మతించి ఆ శిశువు నామెకప్పగించాడు.

***

"ప్రపంచమెంత తమాషా వ్యక్తుల్తో నిండి ఉంది."

"ఆ తల్లికి పసికూనను విడుచుటకు మనస్సెట్లా వచ్చిందో?" "పాపం చేసేటప్పుడు ఎంత మజాగా ఐనా ఉంటుంది. ఇదంతా ఇప్పటి సంఘసంస్కారుల ప్రతాపం"

"ఇంకా ఎన్ని విడ్డూరాలు పుడతాయో చూడకపోతామా?"

"ఇది చలం గారిలాంటి స్వేచ్ఛావాదుల కథల పరిణామం అంటే తప్పేమి"

"ఆడవాళ్ళు అక్షరాస్యులైతే ఇవ్వే బయల్దేరతాయి ఈ రోజుల్లో" ఇల్లా అనుకొంటూ ఎవరిదోవన వారు వెళ్ళిపోయారు.

***



కాలచక్రం రెండారెలు తిరిగింది. అదే ఊరు, అదే దేవాలయం, అదే ఆవరణం, అదే సమయం, మళ్ళీ స్త్రీ పురుషులల్లానే కూడారు. ఇసుక చల్లినా రాలకుండా ఉంది గుంపు. పిల్లనకా పెద్దనకా ఉన్నవారున్నట్లు విన్నవారు విన్నట్లు పరిగెత్తుతూ వచ్చారు జనులు. అదో జాతరలాగుంది. ఎప్పటివలెనే ఆరోజు కూడా పూజారి ఆలయానికి వెళ్ళాడు. రెణ్ణెల్ల ముందు నవోదిత శిశువు ఏడుస్తూ పడివుండిన ఆ స్థలంలోనే శ్రీరామచంద్రుని చక్కని విగ్రహమొకటి పడివుంది. నిమిషార్థంలో కార్చిచ్చువలె ఊరంతా ప్రాకిపోయింది కబురు. శ్రీరామచంద్రుడే సాక్షాత్తుగా అవతరించాడంటే జనం గుంపులు గుంపులుగా పోగవడంలో ఆశ్చర్యమేముంది? ఆ వచ్చినవారంతా విగ్రహానికి నమస్కారాలు చేస్తున్నారు. భక్తిభావంతో పూలూ పండ్లూ హారతులు ఒకరికంటే ఒకరు ముందుకురికి సమర్పించాల్నని తహతహలాడుతున్నారు. అందరి కంఠాలు పారవశ్యంతో గద్గదికాలయి ఉన్నాయి.

అంతట్లో రుద్రాక్ష మాలాలంకృత కంఠంతో జోడుశాలువలు కప్పుకొని చెవుల్లో కుండలాలల్లాడుతూ ఉండగా ఓ శాస్తుర్లు జనాన్ని పక్కకుతోసుకొని మూర్తిని సమీపించి భక్తిభావంతో దాన్ని తన ఎదకదుముకున్నాడు. గద్గద కంఠంతో రామభజన మొదలు పెట్టాడు. అక్కడివారంతా నివ్వెరపడి చూడసాగారు. వారి నివ్వెరపాటు తొలగించేదాకా శాస్తుర్లు, కప్పుకున్న శాలువతో కన్నీరద్దుకొంటూ ఇల్లా చెప్పసాగాడు.

"ఏమని చెప్పాలె? ఎంతని చెప్పగల్గుత? ఇన్నేండ్లకు కదా నా రామభక్తి ఫలించింది. స్వయంగా రామచంద్రప్రభువే నాకు దర్శనమిచ్చాడు. స్వప్నంలో సాక్షాత్ రాముడే నాకగుపడ్డాడు. పాపినైన నన్ను పవిత్రం చేశాడు. ఎడమవైపు మాతృమూర్తి సీతాదేవి, దగ్గరనే తమ్ముడు లక్ష్మణమూర్తి నిల్చునియున్నాడు. భరత శత్రుఘ్నులు చామరాలేస్తూ ఉన్నారు. ఆ హాంజనేయుడు కాళ్ళు పడుతూ ఉన్నాడు. ఆహా ఏమి ఆ దివ్య దృశ్యం! ఆహా ఏమి నా అదృష్టం!! ఆహా ఏమి నా భాగ్యం?!!"

అని పల్కుతూ ఆ ప్రతిమను కౌగిలించుకొని స్మృతితప్పినట్లూ శివమెత్తినట్లూ నటింపసాగాడు.

"తర్వాత ఏం జరిగింది, ముందేమైంది" అని ప్రశ్నపరంపరలను ధర్మాభిమానులైన స్త్రీపురుషులు ఆతురతతో కురిపింపసాగారు. దీన్ని చూచి, సమాధి భంగమైనట్లు నటించి స్వప్నం యొక్క ఉత్తరార్థాన్నిలా అందుకున్నాడు.

"రామచంద్ర మహారాజు నాతో 'వత్సా సంస్కారుల విరుద్ధంగా నీవు గావించే

సమరం నాకెంతో నచ్చింది. భక్తాగ్రణీ! నేనీ పూరి రామమందిరంలో తంతెలమీద పడి వున్నాను. నాకొరకో దేవాలయము కట్టించు. అందు స్వేచ్ఛావాదులు, సంస్కారులూ వీరికి వ్యతిరేకంగా సమరసన్నాహములు జరుపు' అని సెలవిచ్చారు'.

'దేవర వారికి దాసునిపై ఇంత అనుగ్రహం కలిగిందంటే నాకేమి కొదువ?' అని చేతుల జోడించాను. నేనప్పుడు నాలో లేకుంటిని సమాధిలో ఉంటిని" అంటూ తాదాత్మ్యకత్వాన్ని హావభావ విన్యాసాల్తో ప్రదర్శించాడు. జనమంతా తన వల్లో చిక్కిందని తెలిసి యిలా ప్రారంభించాడు మళ్ళీ.

"కండ్లు తెరచి చూసేసరికి శ్రీరాముల వారదృశ్యులైనారు. లేచి అట్టే పరిగెత్తుతూ ఇక్కడికొచ్చేవరకు దమ్ము తీసుకోలేదు. ఇక్కడ నాకేమగుపడ్డదనుకొన్నారు? అదే స్థితి. అదే దృశ్యం. అదే నీరదచ్ఛాయనీనుచున్న సుందరవిగ్రహం."

ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడూ, "శాస్త్రిగారు నిజంగా ధన్యులు. అందుకే స్వయంగా శ్రీరామచంద్రులు వారికి దర్శనమిచ్చారు" అంటూ సాష్టాంగపడ్డారు.

ఇంతలో పూజారి ఒక పీటనలంకరించుకొని తీసుకవచ్చాడు. శాస్త్రిగారు పదిలంగా ఆ విగ్రహాన్ని ఆ పీటపై ఉంచారు. దేవుడికి చలేస్తుందని శాస్త్రిగారు శాలువా కప్పారు.

ఇద్దరు స్త్రీలు వింజామరలు వీయసాగారు. క్రైస్తవ బ్యాండు, తురక తాషాలు, నౌబత్తులు, డప్పులు మున్నగు వాయిద్యాలతో ఆ శిలావిగ్రహాన్ని ఊరేగించారు. ఇండ్ల ముందూ, కప్పులపైనా, కిటికీల్లో, గుమ్మాల్లో, చెట్లమీదా, నేల ఈనినట్లు కిటకిటలాడుతూ ఎక్కడచూసినా జనులు క్రిక్కిరిసి ఈ వేడుకను చూస్తు ఉన్నారు. ఇట్లా ఆ రథాన్ని వీథులన్నింటిలో ఊరేగించి మళ్ళీ దేవాలయానికి తీసుకొచ్చారు. పిన్నలూ, పెద్దలూ బ్రాహ్మణాది అన్ని జాతుల వారూ ధనవంతులూ బీదలూ అనే భేదం లేకుండా తోచిందేదో అక్కడ సమర్పించుకొన్నారు. చూచేలోపల వేలకొలది ద్రవ్యం మందిరం కట్టించడానికిగాను పోగైంది. అదంతా మన శాస్త్రిగారి కీయబడ్డది. ఇంతకూ శాస్త్రిగారికి అవకాశం బాగా లాభించింది. అవకాశాలు దొరికినా లాభం పొందేవారే కావలెకదా?

***

నిమిషంలోనే శిలావిగ్రహానికి వేలరూపాయల చందా వసూలైంది.



రత్నఖచిత మందిరమొకటి నిర్మింపబడ్డది. ప్రారంభోత్సవం నాడు మండపాన్ని అలంకరించారు. పుత్రపుష్పాల్తో కైంకర్యం కోసం కడవలో పాలూ, కావళ్ళలో పెరుగూ బండ్లనిండా పండ్లూ సమకూర్చబడ్డాయి. ప్రసాదం కోసం గుట్టలు గుట్టలు చేర్చబడ్డాయి పదార్థాలు. ఆరోజు గ్రామంలో అందరికీ సంతర్పణ. ఒక్కొక్క పంక్తే లేవడం మొదలెట్టింది. ఇలాంటి హడావిడి ఆ వూళ్ళో ఇదివరకెప్పుడైనా జరిగిందో లేదో? ఆ ఒక్కరోజే వేలు వసూలైనవి.

ఇదంతా ఎందులకు? ఎవరికోసం? ఊరూ పేరూ తెలియని అవ్యక్తుడగు ఓ శిల్పకారుని కృషిఫలితమగు శిలావిగ్రహం కోసం. రోజూ సక్రమంగా పూజ జరుపుటకు ఓ మార్వాడి ఒక పెద్దమొత్తాన్ని దానం చేశాడు. దేవాలయంలో ముప్పూటలూ వాజంత్రములు మ్రోగించేందు కో ధనవంతురాలు భారం వహించింది!

***

ఒకటే ఊళ్ళో, ఒకే గుళ్ళో జరిగిన భిన్న భిన్న ఘటనలు వేర్వేరుగా చిత్రించబడ్డాయి. హిందూ సమాజంలో జన్మించిన నిరపరాధుడైన ఆ శిశువుకెక్కడా సమాజమాశ్రయమొన్నీయ లేదు. తుదకతడు క్రైస్తవ శరణాలయంలో తలదాచుకోగలిగాడు.

మరి రాతిబొమ్మకో? సాటిలేని గౌరవం దొరికింది. ఇట్టిదే మనకు ధర్మంపై ఉన్న ఆదరం – ప్రేమాను! ఇదే మన భూతదయ.

***

'మా చిన్న కథ' – గోల్కొండ పత్రికలో 19-8-37

# మనమే నయం

'ఇవ్వాళ్ళ ఎల్లయ్య మన మెడల పైకాణికి బదులు, ఋక్కాగులాలు, బ్యారేడు జోడులకు బదులు పూలదండలు, నొదుట కుంకమ పెట్టి కొరడా చురుకులకు బదులు వెన్నుపై దయతో చేయితిప్పుతున్నాడేమి?' అని నల్ల ఎద్దు తెల్ల ఎద్దును ఎల్లయ్యకు తెలియకుండానే ప్రశ్నించెను. అంత తెల్ల ఎద్దు.

'ఓపికపట్టు. అంతా జరిగినట్టు జూడు. అదే తెలుస్తుంది. నాకుమాత్రం ఏమి తెలుస్తుంది' అనెను.

ఆరోజు ఎస్‌పిసిఎ (జంతువుల యెడ జరుగు అన్యాయ నిరోధక సంఘము) స్థానికశాఖ కార్యకర్తలు తమ సంస్థ యొక్క వార్షికోత్సవము జరుపదలచిరి. వారు నాడు పురప్రముఖులతో బాటు పురములోని కొన్ని ఆవులను, గుర్రాలను, ఎడ్లను, బాగా బలసిన వానిని వెతికి వెతికి ఊరేగింపు జరుపుటకు ఏర్పాటుచేసిరి. మల్లన్నసేటు గారి భర్తి బండిని లాగే పై రెండు ఎడ్లు కూడా నాటి ఊరేగింపులో పాల్గొనవలసి యుండెను. అందుకనే వాటి కాపరి ఎల్లయ్య వాటిని బండికి కట్టక అందంగా అలంకరించుచుండెను.

పగలు మూడుగంటలకు బాజాభజంత్రీలతో, వాలంటీర్ల 'గార్డ్ ఆఫ్ ఆనర్లతో' చెప్రాసి మొదలు సుబేదారు వరకు గల ప్రభుత్వోద్యోగులు, లక్షాధికారులు, బిచ్చగాండ్లు, విద్యావంతులు, అవిద్యావంతులు, డాక్టర్లు, వకీళ్ళు, వారు వీరు అననేల అన్నికులాల, సంఘాల మతాల, ప్రతినిధులు ముందునడవ ఎడ్లు, గుర్రాలు, ఆవులు మహావైభవంగా ఊరేగెను. గుంపులోనున్న చాలామంది పెద్దలకు (వారికి గల ధన సంపదలచే పెద్దలు) నాటి యా హడావుడి విషయము కథా ప్రారంభముననున్న ప్రాణులకి తెలిసినంతే తెలియును. పాపమా నల్లెద్దుకు ఎల్లయ్య బలవంతముచే నాటి యా వుత్సవములో పాల్గొనవలసి వచ్చెను. గుంపులోని చాలామంది పెద్దలు ప్రభుత్వమువారి ఉన్నత ఉద్యోగుల యాజ్ఞాబద్ధులై నడుచుచుండిరి. ఇంతే తేడా.

పెద్ద హడావుడితో ద్విపద, చతుష్పాదముల అపూర్వమైన గుంపు పురమందిరము జేరెను. అక్కడ అదివరకే సభకు తగిన ఏర్పాట్లు చేయబడియుండెను.



ప్రభుత్వమువారి ఒక గొప్ప ఉద్యోగి (అధికారి) అధ్యక్షత వహించెను. సంఘ కార్యదర్శి వార్షిక నివేదిక చదివి వినిపించెను. దానిలో యెన్నివందల ముల్లుకట్టెలు విరగకొట్టినది, యెంతమంది బండ్లవాండ్లను, జట్కావాండ్లను, బక్కవాటిని, గాయపడినవాటిని, ఎడ్లను, గుర్రాలను బండ్లకు కట్టినందుకుగాను కోర్టుకెక్కించి జరిమానాలు జేయించినది (దానిచే ఆ బక్కవాటికి గడ్డికొనుటకు చిల్లిగవ్వలేక ఎన్నింటినో చంపుకొన్న సంగతి దానిలో లేదు) వివరంగా వుండెను. తర్వాత నలుగురైదుగురు పెద్దలు, జంతువులకు గల కష్టాలు, ఇబ్బందులు, వానిని మాన్పుటకు ఉపాయములను గూర్చి ఘనంగా ఉపన్యసించిరి. (యింతకు వారిలో ఎవరికి ఏ జంతువునకేమి కష్టమో ఏమి సుఖమో తెలియదు). సభానంతరము పెద్దలందరు తమతో ఊరేగిన జంతువులను జూచిరి. వారంతా మోటార్లలో తిరుగుతూ భవనాలలో జీవనం గడిపేవారు. కావున ఆ జంతువుల జూడ వారికెంతో సరదాగా వుండెను. వారిలో కొందరికి గుర్రాలన నేవో, యెడ్లన నేవో కూడా తెలియదు. ఇట్లు ఈ తమాషా జరగిన తరువాత పెద్దలందరు తమతమ బంగళాలకు, పశువులు తమ తమ దొడ్లకు వెడలిపోయెను. మన నల్ల, తెల్ల యెద్దులు గూడా నాడు తమ జీవితములో మొదటిసారి బండి లాగనిదినము (విశ్రాంతి) జరిపి యెల్లయ్య సహాయంతో తమ దొడ్డిని జేరుకొనెను. పాపం నల్లది ఉదయం తానడిగిన ప్రశ్నకు సంతృప్తికరమైన ప్రత్యుత్తరము గానక చింతతోనుండెను. అంత తెల్లది దానితో నిట్లనెను.

"నేటి 'ఫార్సు' (బూటకము) నీకు బోధపడలేదేం? చెపుతాను విను. ఈ మనుష్యులలో కొందరు, అందులో ముఖ్యంగా పనిపాటలు లేకనే వందలు వేలు గడించేవారు మన క్షేమం కోసమని ఓ సంస్థ స్థాపించారు. ప్రత్యక్షంగా నిత్యజీవితములో వారికీ మనకూ ఏమీ సంబంధం లేదు. మనతో నేరుగా సంబంధం వున్నవారు, మనవలన జీవనోపాధియేగాక వేలపుట్ల ధాన్యము పండించుకునేవారు, మనపై మనము ఈడ్చె బండ్లపై స్వారీ జేయువారు, మనలను తిండి సరిగా పెట్టక కష్టపెట్టెదరనియు, మనకు రోగం వచ్చిన, గాయాలు తగిలిన, చికిత్స చేయించకనే మనతో పనిజేయించుకుంటారనియు, అందువలన మనమందరము చాలా ఇబ్బందులపాలగుచున్నామనియు వీరి అభిప్రాయము. అందుకనే ఈ సంఘం వారు యెంతో ప్రయాసపడి మన కాపరులగు నరులనుండి వేలకు వేలు ముల్లు కట్టెలను లాగికొనుచున్నారట. బక్కబడినవాటితో, రోగాలావాటితో, గాయపడినవాటితో పని తీసుకొను నరులను కోర్టులకెక్కించి శిక్షిలిప్పించుచున్నారట. కాని వీరికి కళ కళ

నరకబడే జంతువులపై ఏమాత్రము దయలేదు. ఒకేసారి చంపుట యన్న జీవితకష్టముల నుండి విముక్తి యిప్పించుటయని వీరి అభిప్రాయము కాబోలు! తమ ఆహారమునకు ప్రతిరోజు తెల్లవారుసరికి, లక్షలకోళ్ళు, గొఱ్ఱెలు, ఆవులు, యెద్దు క్రమముగా నరకబడుచున్నను వీరికేమాత్రము ఆక్షేపణలేదు. అట్లు జంపుటకు కావలసిన జంతువులు ఆరోగ్యము కలవి, బాగా బలిసినవి, ముసలివి కానివి, బలముగాగలవిగా వుండవలెను. ఇది ఏమి భూతదయయో! ఇది ఏమి దౌర్జన్యనిరోధమో!! వారికే తెలియవలెను. ఇంతకూ ఈ సంఘం వారు మనపై జేసిన ఉపకారమేమి? తల్లిపాలు మరచి ఏ నాలుగుపోచలో నమల నారంభించిన నాటినుండియే మనకు ఈ నిర్బంధజీవితము ప్రారంభము. రోజు ఒకటే కార్యక్రమం. స్వేచ్ఛాయననేమో మనమెరుగముగదా. ఏ వాంఛను కూడా దీర్చుకోనివ్వక ఈ నరుడు మన జీవనమును దుఃఖమయం జేయుచున్నాడు గదా. వాడు కట్టిన గుంజవద్ద పడియుండి, వేసిన నాలుగుగడ్డిపోచలు నమిలి, బండికి కట్టితే బండిని, నాగలికి కట్టితే నాగలిని, మోటకు కట్టితే మోటను, అది ఇది అననేల, చేయించిన పనిని తలవాల్చి జేయవలసినదే కదా! లేకపోతే యెముకలు విరగేట్టు బాదుతాడు దుడ్డుకఱ్ఱ పుచ్చుకొని. పనిచేస్తాం, చేస్తూ వచ్చాం, చేస్తూవున్నాము. చచ్చేవరకు చేస్తాం. మనకున్న అన్ని కష్టాలకు మూలకారణం ఈ నిర్బంధజీవనము. దానికి కారణం ఈ నరుడు. వీడేమి! మనసుద్ధరించుట ఏమి! తన జీవనాన్ని సుఖంగా గడుపుటయే పరమధర్మమని తలపెట్టి, అందుకని మనలను అన్ని నిర్బంధాలపాలు జేసే నరుడా మనపై దౌర్జన్యముల నిరోధించునది. ఛీ ఛీ అంతా బూటకం. మోసం. ఏమంటావు, అంతేనా?"

ఇంతవరకూ తెల్ల ఎద్దు ఇచ్చి ఉపన్యాసం శాంతంగా వింటున్న నల్ల ఎద్దు ఇట్లనెను:

"అంతా నిజమే చెప్పావు కాని మనలను ఇంత కష్టపెట్టే ఆ నరుల జీవితం మాత్రం ఏమంత బాగా ఏడ్చింది. వారిలో చాలామంది బ్రతుకు మనకన్నా అన్యాయం. అత్యల్ప సంఖ్యాకులైన భాగ్యవంతులు (అందరికష్టాలకు మూలకారకులు) తప్ప మిగతా కోట్లకొద్ది ప్రజలజీవితం మనకన్న ఎన్నియో రెట్లు అసహ్యకరంగా వుంది. జంతువులలో స్వేచ్ఛగా వున్నవి సుఖంగానే వున్నవి గదా. పోగా మిగిలిన మనవంటివి. మనవంటి వాటికి గూడా అతి దేహకష్టము జేసిన తర్వాతనైతేనేమి తినుటకు గడ్డి, చొప్ప, తెలకపిండి, త్రాగుటకు నీరు, వుండుటకు కప్పుగల దొడ్లు



గలవు. కాని మనుష్యులలో కోట్లకొలది జనులకు ఎముకలు విరుగునట్లు కష్టపడినను వుండుటకు గుడిసె లేక, వారి ఆచారానుసారము దేహము దాచుకొనుటకు గుడ్డలేక, తుదకు త్రాగుటకు జలమైన లేక మలమల మాడుచు అసహ్యకరమైన రోతపుట్టునట్టి జీవనము (కేవలము ధనాఢ్యుల దాస్యము కొరకేయన్నట్లు) గడుపుచున్నారు. వారికి మనకున్నట్లు దౌర్జన్యనిరోధక సంఘమొకటి (ఎస్‌పిసిఎ) లేదు. కనీసం తలనరికి ఒకేసారి కష్టముల నుండి విముక్తి యిప్పించునటువంటి కసాయిఖానాలు గూడా లేవు మనకున్నట్లు. ఇంతకూ మనమే నయము!!" ఇది విని తెల్లఎద్దు తెలతెలబోయెను.

***

*'కాళోజీ కథలు', అణాగ్రంథమాల ప్రచురణము 24 ఏప్రిల్ 1943.*

# "తెలియక ప్రేమ తెలిసి ద్వేషము"

"ఎంత బాగుందోయి పాట. కొంతసేపాగి, విని, మరిపోదామా?"

"నాకు విందామనే వుంది కాని సమయానికక్కడ చేరకపోతే దయాదాక్షిణ్యం లేక దండన విధిస్తాడు ఆ యమధర్మరాజు తెలుసా?"

"అ భయం మనకు లేనిదెపుడు. వైతరణి దాటితే యమపురి ఎంతదూరం. కొంచెం తొందరగా నడిస్తే వేళ కందలేమా ఏమి?"

"సరే నీ యిష్టం కాని, పాశాల్లో జీవాలున్నావే, వెంట తీసుకొని ఎలా వెళ్ళడం గంధర్వులగానం వినేటందుకు?"

"వానిని వైతరణీ తీరాన వదలేద్దాం. తిరుగుతాయి పాపం కొంచెం స్వేచ్ఛగా, ఎటైనా పారిపోతాయన్న భయమూ లేదు. మళ్ళీ ఎన్నాళ్ళకో స్వేచ్ఛ, తలచుకుంటాయి కూడానూ"

"సరే. నీవు చెప్పినట్లు చేయుటకు నాకేం అభ్యంతరం లేదు. కాని, అక్కడకెళ్ళి ఆ పాట వింటుంటే మనకు యమపురి సంగతి, ఈ ప్రాణాల సంగతి జ్ఞాపకం వుంటుందా అని"?

"నేను చెపుతాను లేవోయి కొంతసేపు కాగానే. నీవు నడుద్దూ ఈ పాశాన్ని నాదానితో పాటిక్కడ వదలి."

"సరే, నడువు అట్లాగయితే."

౨

"ఇదేమిటి? ఇప్పటికి నేనొక్కడనే అనుకుంటున్నాను ఈ ప్రదేశంలో- కాని, మీరెవరో వున్నారే నాతోపాటు? మనమెక్కడ వున్నది మీకేమైన తెలుసా?"

"నేను అదే ఆలోచిస్తున్నాను. ఈ ప్రదేశం నాకు కొత్తే. ఎక్కడున్నది ఏమి బోధపడడం లేదు కూడాను."

"సరే కాని, ఎక్కడివాడవు నాయనా నీవు?"

"అయ్యా, నేను భారతీయుడను."



"ఏమీ, భారతీయుడవా, నా తండ్రీ! మా దేశీయుడవేనా నీవు?"

"మహాభాగ్యం, మీరు భూలోక స్వర్గమగు భారతదేశం వారేనానండి?"

"అవును కాని, ఏ ప్రాంతం నాయనా నీది?"

"అయ్యా, నేను నిజాం రాష్ట్రంలోని తెలంగానా మనిషిని."

"ఏమిటి! ఏమంటివి! నిజాం రాష్ట్రంలోని తెలంగానా వాడవే? స్వదేశీయుడవే కాకుండా స్వప్రాంతీయుడవు కూడానా నాయనా? మరి, నీవు మాట్లాడే భాష ఏది, తండ్రీ, ఆ ప్రాంతంలో?"

"ఇంకేభాష మాట్లాడమంటారు మమ్మల్ని? మేము మాట్లాడేది అచ్చం తెలుగండి మహాప్రభో."

"ఏమి! ఏమి! తెలుగే. అట్లయితే నీవు నిజాం రాష్ట్రాంధ్ర సోదరుడవేనా తండ్రీ? అందుకే, నిన్ను చూడడంతోనే ఒక విధమైన సోదరప్రేమ కలిగింది, నాయినా. అయితే ఇక్కడికెలా రావడమైంది, బాబూ?"

"ఏమోనండి, అదే బోధపడడం లేదు నాకూను. ఉదయం మా ఊళ్ళో జరిగిన కొట్లాటలో నాతలపైన దుడ్డుకఱ్ఱ పడ్డాక నాకు స్పృహతప్పింది. తర్వాత ఏమి జరిగిందో తెలియదు. ఇప్పుడు చూస్తే ఇక్కడున్నాను"

"ఎంత చిత్రం, మీ ఊళ్ళో కూడా ఉదయం గోల జరిగిందా. మా ఊళ్ళో జరిగిందే నా తలపైన గొడ్డలిపడడం వరకు జ్ఞాపకం వుంది. తర్వాత ఏమి జరిగినదీ నాకు తెలియదు. ఇప్పుడు చూస్తే ఎక్కడున్నది బోధపడడం లేదు."

"సరే బాగానే వుంది. అయితే మీ ఊళ్ళో జరిగినసంగతేమిటో చెప్పండి. నేను మా సంగతి చెపుతాను తర్వాత. చాలా అన్యాయంగా వుందండి కథ. ప్రపంచంలో దయ అనేది లేకపోవడం సత్యమని బోధపడుతుంది మీకే తర్వాత. మీరు కూడా నాతో మరియు నాతోటివారితో సహానుభూతి చూపకమానరు నా కథ విన్నాక."

"నా కథా అలాగే వుంది అబ్బాయి. ప్రపంచంలో ధర్మమనేది నాశనమయిపోతున్నది దినదినం. ఆచార వ్యవహారాలు మంటగలుస్తున్నాయి లోకంలో. మా ఊళ్ళో జరగినకథ చెప్పితే ఆశ్చర్యపడడమే కాకుండా నమ్మనైన నమ్మవేమో అని అనుమానిస్తున్నాను. అందుకే, నీవే నీ కథ మొదలు చెప్పితే బాగుంటుందని నా అభిప్రాయం."

"నిజమేనండి. ప్రపంచంలో మనుష్యత్వమే లేకుండా అయింది. ఏమి చెప్పేది మా ఊళ్ళో అవస్థ. ఏదో చెపుతాను వినండి. మా ఊళ్ళో ఒక దేవాలయం వుంది. అది మా ప్రాంతంలో చాలా పురాతనమైనది, ప్రసిద్ధికెక్కినది కూడాను. ప్రతిసంవత్సరము పెద్ద తీర్థం సాగుతుంది. ఈ ఏడు జాతర అప్పుడు దేవాలయం ప్రవేశ విషయంలో వచ్చింది తగాదా అస్పృశ్యులకు, సవర్ణ హిందువులకు. సవర్ణులలో కొందరు హరిజనులపక్షం వహించి దేవాలయ ప్రవేశానికి సాయపడతాం అన్నారు. దాంట్లో ఒకరిద్దరు బ్రాహ్మణులు కూడా వుండడం తటస్థించింది. జాతరకంటె ఒకవారం ముందే హరిజనులందరు నిరసనవ్రతంతో దేవాలయప్రవేశ విషయమై సత్యాగ్రహం మొదలుపెట్టారు. బ్రాహ్మణులు, యితర హిందువులూ లాఠీలతో గుడిచుట్టూ కాపలా కాస్తున్నారు. ఈరోజు ఉదయం హరిజనులు కూడా సత్యాగ్రహానికి స్వస్తి చెప్పి జబర్దస్తీగా దేవాలయ ప్రవేశం చేద్దామని లాఠీలతో తయారైనారు. జరిగింది సవర్ణ అవర్ణ హిందువులకు లాఠీలతో సంగ్రామం."

"ఏమీ! నీవూ ఆ దేవాలయ ప్రవేశసందర్భములోనే నెత్తిపగిలి స్వహదప్పిన మహావీరుడవా నాయనా? ధన్యుడవు. స్వర్గంలో ఇంద్రవైభవము పొందగలవు. ధర్మసంగ్రామంలో పాల్గొన్నవాడవు. పుణ్యాత్ముడవు. నీ తల పగులకొట్టిన ఆ పాపాత్ముడెవడు? వానికి నరకం తప్పునా? నేనూ ఆ ధర్మయుద్ధంలో పాల్గొన్న వీరుడనేతండ్రీ. ఇంతకూ, మనమిరువురము ఒక్క ఊరివారమే నాయనా, అయిన నిన్ను కొట్టిన ఆ దుర్మార్గుడెవడో జ్ఞాపకమున్నదా?"

"కష్టమన్నది తెలియక రోజు మూడుపూటలూ అన్యాయంగా మమ్మల్ని దోచుకొని తిని బాగా బలిసిన ఒక లావాటి బాపనయ్య, ప్రక్కనుండి, నా తలపై దుడ్డుకఱ్ఱ వేసాడు. అతనికీ తగినశాస్తి అయిందనే నా అభిప్రాయం. మా వెంకడు అప్పుడే గొడ్డలితో అతని బుఱ్ఱపై కొట్టినట్లు చూడడం నాకు జ్ఞాపకం."

"ఓరి ముండాకొడుకా! మాదిగవెధవవు ఇక్కడా దాపురించావు? పొద్దున్నే కసితీర లాఠీతో కొట్టి దేవాలయ ప్రవేశంకంటె మొదలు యమపురి ప్రవేశం చేయిస్తామని అనుకుంటే ఆ గొడ్డలిదెబ్బ నా తలపై పడడం చేసి తప్పించుకుపోయావు. కాని ఇప్పుడెటు పోతావురా? గొంతుకపిసికి పారేస్తాను చూడు."

"ఆ బాపనయ్యవు నీవేనా? బొర్రపై ఒక లాఠీ కొట్టానంటే నిన్న సంతర్పణలో తిన్న భక్ష్యాలన్నీ బయటపడాలే జాగ్రత్త నా మెడ పిసకడమంటే పిండాలకూడు పిసకడం అనుకున్నావా"



"అబ్బా! ఎంత తన్ను తన్నితివిరా?"

"అయ్యో చస్తి! చేతకాక కొడుతావటయ్యా! ఉండు నీపని పట్టిస్తా"

"అబ్బా ఎంత గుద్దు గుద్దితివిరా పేగులు వెళ్ళేటట్టు తొక్కుతానుండు."

"ఏడ్చావు బాపనయ్య కిందపడ్డా నాదే గెలుపంటావు. చూడు నీవు చేస్తానన్నపని నేనే చేస్తా."

"అయ్యో చస్తీ! చస్తీ! ఎవ్వరన్నా రక్షించండి బ్రాహ్మణ్ణి, చచ్చిపోతున్నాను పుణ్యానికి."

3

"అరే చాలురా పాటవినడం. నదీతీరాన ఏవో కేకలు వినవస్తున్నాయి. ప్రాణాలను పాశాల్లోంచి వదలివచ్చాం. అలవాటు చొప్పున ఇక్కడా కొట్లాడుకుంటున్నాయో ఏమో"

"అవునురా ఈ కేకలక్కడివే. ఆ బ్రాహ్మణ మాదిగ పంచాయితేరా ఇక్కడ కూడా."

"నడువుమరి"

"మంచిది"

"...................."

"...................."

"...................."

"...................."

"వీరికావరమండా. ఇక్కడేదో పోనీ పాపమని కొంతస్వేచ్ఛ యిస్తే మళ్ళీ తన్నుకుంటున్నారేమిరా?"

"చచ్చి ఇంకా సరిగా పదగంటలు కాకపోయే. ద్వేషం అప్పుడే పోతుందా?"

"వీరి ద్వేషం చట్టుబండలు గాను. ఇదేం కావరంరా చచ్చినా ఈ మతపిచ్చి ఈ వర్ణబేధ శతృత్వం పోలేదేం? యమపురిలో తీర్పుచెప్పిన తరువాత తెలుస్తుందిలే సంగతి."

"ఇంకా ఆలోచిస్తున్నావేమి నేను పాశంలో వేసుకొని నడవటానికి సిద్ధంగా వుంటే?"

"సరే నడువు నేనూ ఇదే బంధిస్తున్నాను ఈ బాపనయ్యను.?

"తొందరగా నడవాలి టైము ఎంతో లేదు మనకు."

"నీవు కదిల్తేగా మాటలతోనే సరిపోయె?"

"సరే నడువవోయి."

౪

"ఏమి ఇతడు ఆ అమాయకులైన హరిజనులు దేవాలయ ప్రవేశం చేస్తామంటే అడ్డుపడడమే కాకుండా ఒక హరిజనుని కర్రతో బాది చంపినాడా?"

"అవును మహాప్రభో"

"ఏమోయి, మావాడు నీ విషయమై చెప్పేది నిజమేనా?"

"అయ్యా నిజమే కాని ధర్మసంరక్షణ"

"నోరుమూయి ధర్మాధర్మములు ధర్మరాజునైన నాకా నీవు చెప్పేది? ఒరే ఇతనిని పదిరోజులూ అగ్నిగుండంలో పడవేసి తరువాత కొచ్చిన్‌లోని ఒక పరయా (మాదిగ) కుటుంబంలో పడెయ్యి సుఖపడుతాడు. ధర్మం తెలుస్తుంది కూడాను."

"చిత్తం మహాప్రభో."

"అయ్యో అగ్నిగుండమా? మాదిగజన్మమా? అన్యాయం! ఘోరం...'

"........'

"వీడెవడురా?"

"దేవాలయ ప్రవేశానికి లారీతో పోయి ఇప్పటి బాపనయ్యతో చంపబడ్డ హరిజనుడు"

"అట్లాగా.... ఒరే నీవు మహాత్ముడు చెప్పిన అహింసావిధానం మాని లారీ సహాయమెందు కపేక్షించావు దేవాలయ ప్రవేశానికి?"

"ఎన్నిరోజులు ఊరికే ప్రయత్నించినా ఆ బాపనయ్యలకు దయరాలేదు విసిగి వేసారి జబర్‌దస్తీకి దిగాం మహరాజా."

"అది తప్పే... ఒరే వీడిని రెండురోజుల ఆ మంచులో పడవెయ్యి కోపం అంతాపోయి శాంతమలవడుతుంది. మూడోరోజు తిరువాన్‌కూరులో హరిజన కుటుంబంలోకి పంపించు."

"తెనుగు దేశంలో కాక మలయాళదేశంలో ఎందుకు తండ్రీ జన్మం?"

"మళ్ళీ దేవాలయ ప్రవేశపు చిక్కులేకుండా. లేకపోతే ఏ బ్రాహ్మణుడిచేతనో తలపగులకొట్టించుకొని చేరుకుంటావు నావద్దకు."

"మహాభాగ్యం."

❋❋❋

*'కాళోజీకథలు' అణాగ్రంథమాల ప్రచురణము 24-ఏప్రిల్ 1943*



# విభూతి లేక ఫేస్‌పౌడర్

"కొన్నిరోజులింకా ఓపికపట్టు, ఎలాగైనా ఆ భోలాశంకర్‌ను బోల్తాకొట్టి కావలసినంత బూడిది (ఫేస్‌పౌడర్) తెచ్చి పెట్తాను."

"ఎప్పుడు ఇంతే. రోజూ 'కొన్నిరోజులాగు కొన్ని రోజులాగు' అనడమే. చేతనైతే తీసుకురావాలె. లేకుంటే చేతకాదని చెప్పాలె. మాటలతో సరిపోతుందని..."

"నీ దయ ఊరుకొందువూ. నాకు చేతనయ్యేది కానిదీ నీకు తెలిసినవిషయమేగా. మరి అనుకుంటె ఏమి లాభం."

"కాకపోతే ఏమిటండి. నేనేమి మాన్యాలు అడిగ్యానా. సొమ్ములు చేయించమని బాధపెట్టానా. అడుగకా అడుగకా అడిగింది మొహానికి రాసుకోవటానికింత బూడిదా (ఫేస్‌పౌడర్). పైనించి సత్యమ్మ తన మొగుణ్ణి చాలా బాధపెడుతుందనీ, ఆమె ప్రతి కోర్కె కృష్ణయ్యకు నెరవేర్చకతప్పదనీ లోకంలో ప్రతీతి."

"నీవు తక్కినవేవీ అడగకుండా ఆ పాడు బూడిద అడగడం చేతనే వచ్చింది చిక్కు. ఆ శంకరయ్యకు వేరే పనేదీ లేకపోవడం చేత ఎప్పుడూ కూచుంటాడు. ఆ బూడిదెను కాచుకొని. మనకతడు ఇస్తాడనే ఆశలేదు వైష్ణవులము కాబట్టి. పోనీ అభిమానం చెడి అడుగుదామనుకుంటే అతనొకవేళ ఇయ్యటానికంగీకరించినా పార్వతమ్మ ఇవ్వనిస్తుందా. పనికిరాని సొమ్ము దానం చేస్తామన్నా ఆడమనిషి చూచి ఊరకుంటుందా."

"ఆడవారిని నిందించటం మీకలవాటైంది. నిజం చూస్తే పీసిడితనం అంతా మొగవారిలోనే వుంది. శంకరయ్యగారే యివ్వలేరని చెప్పండి."

"ఏదో కొన్నిరోజులూరుకొందువూ. ఎట్లాగైనా మన ఫేస్‌పౌడర్ రావడం ప్రధానం కాని పార్వతమ్మ పీనాసా లేక శంకరయ్య పీసోడా అని కాదిప్పుడు వాదం, నీవు సంతోషిస్తానంటె ఆడవారలే దానశూరులని ఒప్పుకుంటా."

"సరే దానికేమిగాని, ఎట్లాగైనా చేసి కొంచెం ఆ ఫేస్‌పౌడర్ తెచ్చిపెట్టండి."

"అట్లాగే తప్పకుండా. నన్ను కొంచెం ఆలోచించుకోనిస్తావా"

"మీ ఇష్టం, ఈ దీపావళి వరకు నాకు ఫేస్‌పౌడర్ తప్పకుండా కావాలె చెప్పలేదనుకునేరు. అదిగో తొమ్మిది కొడుతున్నారు వెళ్ళాలి నేను... ఇంట్లోకి."

౨

"ఎప్పుడూ మీకు మీ బూడిద ఫ్యాక్టరీతోనే కాలం గడిచేటట్టుందే."

"ఏమి చెయ్యమంటారు మరి. విభూతిభక్తులు ఎక్కువైపోతున్నారు దినదినం. సప్లయిచేయలేక చస్తున్నాను నేను. పని విశేషంగా వున్నది ఈ రోజుల్లో."

"సరేగాని మీ మామగారింట్లో ఏదో వివాహం అని విన్నాను, మీరు పోతున్నారా?"

'ఎవరన్నా వింటె నవ్విపొయ్యేరు. వానింటికి నేను పోవడమా, మొన్న మా వినాయకుని నామకరణంనాడు కట్నాలు పెట్టక అవమానపెట్టింది చాలదని వాని యింటికి మళ్ళీ పొమ్మంటారా?"

"పోనిద్దురూ. ఆమాటకేమిగాని. నేను మీ మామగార్ని నీ విషయంలో చీవాట్లు పెట్టాను. ముందు ఎన్నడూ ఇట్లా జరుగదు లెండి! నా భారం."

"అయ్యా! మీకు దూరంనించే నమస్కారం. తంటాలు పెట్టించడం అవమానపడ్డవారిని చూచి పకాపకా నవ్వడం మీకలవాటైపోయింది. నేనెంత 'భోలాశంకర్'నైన మీ ఆటలు నాముందు సాగవు.'

"నారాయణ! నారాయణ! నీతోటి మోసమా శంకరయ్యా. ఎంతమాట."

"చాలు చాలు; వెళ్ళండి ఆ నారాయణ వద్దకే. నాకిప్పుడు మీతో మాట్లాడుటకు వ్యవధిలేదు."

"సరే వెళ్ళుతున్నాలే. కోపబడకు."

౩

"ఏమండి మావాండ్ల ఇంట్లో పెండ్లట వెడదామా."

"వెడదామా, సిగ్గులేక అడుగుతావేం. మొన్న జరిగిన అవమానం చాలదేం"

"అయ్యో! ఇట్లా కోప్పడితే ఎట్లా మరి. ఏదో వసతిలేక..."

"ఏడ్చారు, వసతిలేక ఏమి. రోగమా. ఆరోజే దివాలా తీస్యాడని తండ్రీ, ఆ పీనాసీ..."

"చాల్లెండి. మరి ఇప్పుడేమంటారు"



"అనేదేమిటి. వానింటికి మళ్ళీ ఈ జన్మంలో..."

అట్లా అనకండి మీ దయ మాచెల్లెలు పెండ్లి"

"నాకివన్నీ సరిపడవు. వెళ్ళకూడదు. నేను వెళ్ళను. నిన్ను వెళ్ళనివ్వను."

"మీకంటె ఆ బూడిదమూలాన వీలుపడదనుకొండి. కాని నేనన్నా..."

"నీవు పోకూడదు. నీ తండ్రి పేరు వింటే నాకొళ్ళు మండుతుంది."

"మండుతెమానె. చల్లార్చేందుకు గంగమ్మ లేదా మీకు. నేను మాత్రం వెళ్ళొస్తా."

"పిలుపు రాందే"

"మా వాళ్ళింటికి పోవటానికి పిలుపెందుకు"

"సరే నీయిష్టం. చూడు తర్వాత చింతిస్తావ్"

"ఏమైనాసరే. వెళ్ళక తప్పదు. మీకు బూడిద (ఫేస్‌పౌడర్) తయారుచేసేందుకు గంగమ్మను నెత్తిమీద ఆడించుకునేందుకు కొంతసమయం చిక్కుతుందిగా. సంతోషమేగా. నేను మాత్రంపోక మానను."

౪

"ఏమి? మీరు పోయి నాయింట్లో వివాహం వుందని, అప్పుడు కట్నాలు పెట్టడానికి వీలులేకపోయిందని అన్ని విషయాలు చెప్పితే చింతించడానికి బదులు కోపంతో నన్ను తిట్టాడా. కావరం, మస్తీ. నేనేమీ వీనికి బాక్యా కట్నాలు పెట్టటానికి. ఈసారి పెండ్లికి కూడ పిలువనువాణ్ణి చూద్దాం. ఏమి చేస్తాడూ?"

"మీరూ అట్లాగే తొందరపడితే ఎలా. ఎంతైనా అతడు మీ అల్లుడు. పార్వతమ్మను చూచైనా ఊరుకోవాలి. తప్పక పిలిపించండి నా మాటవిని."

"ఛీ! ఆ మాట ఎత్తకండి. ఈ సారి అందరి ఎదుట వానికి నాకూ పంచాయితీ అవడంకన్న వాణ్ణి పిలువనిదే మంచిదని నా అభిప్రాయం"

"పార్వతమ్మనైనా పిలిపించరా"

"అదీ దుర్మార్గురాలే. దాని మొగడు నన్నంతగా తూలనాడినపుడు కొంచమైనా బుద్ధి చెప్పనక్కర్లేదా"

"అవునండి నిజమే. నేను మీ అల్లునికి నచ్చచెపుతూ వుంటె, తాను పకాపకా నవ్వడం మొదలుపెట్టింది. అతను మిమ్మల్ని తిడుతుంటె వద్దనడమటుండనీయండి. నడుమ నడుమ ఆహుతులు వేసింది కూడాను"

"దాన్ని పెంచి పెద్దదిగా చేసి పెండ్లిచేసి యిచ్చినందుకు ప్రతిఫలం యిది."

"సరే నేను వెళ్ళొస్తాను. సెలవు."

"రేపు ప్రొద్దున్నే లగ్నం. తప్పక రావాలి."

"తప్పక, మీరు వేరే చెప్పాలా"

"మంచిది."

౭

"నాన్నా మీరెవరూ పిలువనంపనిదే, నేనై నేను వస్తె, సంతోషిస్తారనుకున్నా. కాని పలకరించనైనా పలుకరించవైతివేమి నాన్నా"

"........."

"నాన్నా మాట్లాడవు..... అమ్మా నీవు మాట్లాడవా"

"........."

"చెల్లె, నీకు సైతం నామీద కోపం వచ్చిందా... ఇంతకూ నేచేసిన తప్పేమి"

"........." తండ్రి

"........." తల్లి

"........." చెల్లెలు

"ఛీ నాదే తప్పు. పిలువందే, మావారు ఎంతచెప్పినా వినక, ఏదో తండ్రి ఇల్లుకదా, చెల్లెలు పెండ్లి కదా అని భ్రమపడి రావటం తెలివితక్కువపని కాదా"

"అంత బుద్ధికలదానవు మరి వెళ్ళిపోక ఎందుకు నిలుచున్నావు. అభిమానంగల పొగరుబోతు భార్యవు."

"అమ్మా! నాన్న అట్లా దయలేక అంటుంటె నీవు గమ్మున ఊరుకుంటావేమె"

"........." తల్లి.

"నీ మొగడు నన్ను తిడుతుంటె నీవు ఊరుకొనక మంత్రపుష్పానికి సహపాఠివైనావు. మీ అమ్మను గూడా అట్లే చేయమంటావా"

"........." పార్వతమ్మ.

"ఇక చాల్లెండి. వచ్చిన చుట్టాలు ఏమనుకుంటారు విని" తల్లి.

"ఖబర్దార్, నీవు నడుమ మాట్లాడావంటె, వచ్చినవారి ముందరే వాని అవమానం పరచేదె ఖరా"



"చాలు నాన్నా, ఇదివరకన్నదేదో అన్నావు, ఈ పైన నాభర్త పేరు తీసేపని లేదు, ఇదే నేను వెళ్ళిపోతున్నాను."

"........."

"మీ కోపం కొంప ముంచింది. ఇంటికివచ్చిన ఆడబిడ్డ మంచినీళ్ళైనా తాగకుండా వెళ్ళిపోయింది."

"బాగైంది. నాకు సంతోషమే."

"........."

౮

"ఏమిచేస్తున్నావు లోపల"

"వస్తున్నానుండండి."

"తొందరగా రా"

"........."

"వచ్చావా"

"ఏమిటీ ఇదో వచ్చా"

"రేపిదివరకు నీకు కావలసినంత ఫేస్‌పౌడర్ తెచ్చిపెడతాను."

"అబద్ధాలు."

"నిజం. నిజం. నీతోడు"

"వీలెట్లా కలుగుతుంది"

"నీవు చెప్పనిస్తెగా, ఇప్పుడే నారదయ్య ఉత్తరం వచ్చింది, చదువుతాను. విను.... ఏమనగా, నీవు చెప్పిన ప్రకారం పార్వతమ్మను శంకరయ్య వద్దన్నా వినక తల్లిగారింటికి పొయ్యేటట్టు చేస్యా. శంకరయ్య యిది భరించలేక ఫ్యాక్టరీ వదిలి ఎటో పారిపోయాడు. పార్వతమ్మ తండ్రితో చీవాట్లు తిని ఏడుస్తూ ఇంటికొచ్చి చూస్తె శంకరయ్య లేడు. చింతిస్తూ పనివారినందరిని వెతకటానికి పంపించి తాను కూడా భర్తను వెదుకుతూ ఎటోపోయింది. ఇక నీవూ నీ పని...."

"చాలు, చాలు, ఇక ఆ ఉత్తరం చదువుకుంటూ కాలం వ్యర్థం చేయకండి. ఇప్పుడే బయలుదేరండి పౌడర్ తేవడానికి."

"అయ్యో, కొంచెం ఓపికపడుదువూ, సాయంత్రం వెళ్ళుతా."

"వీల్లేదు. ఇప్పుడే పోవాలి, సాయంత్రం ఫేసుకు పౌడర్ ఎక్కించాలి. కొంచెం ఎక్కువేతెండి పనిలోపని."

"సరే వెళ్ళొస్తానిప్పుడే."

"సరే, సంతోషం, భాగ్యం కూడాను."

"........."

౭

"నీవెవరు. ఈ ప్రదేశంలో ఒంటరిగా తిరుగుతున్నావు."

"నా అనేవారెవరు లేరునాకు. ఏమి చెయ్యమంటారు." "మేము కోయవాండ్లం. కాని మీరు ఒంటరిగానే వున్నారే..."

"నేను ఒంటరినైపోయాను. మరి నీవు యిష్టపడితే...."

".............", తలవంచుకొంటుంది.

"మా యింటికొస్తావా?"

"మీరే మా ఇంటికొస్తె."

"సరే, మరీ సంతోషమే. నేను కోపం వచ్చి ఇల్లువదిల్యాను. మళ్ళీ అదే ఇంటికి పోదామంటే ఇష్టంలేదు కూడాను."

"నడవండి మరి."

"నడువు."

".............."

".............." కొంతదూరం నడిచ్యాక.

"మా ఇల్లూ ఇటేవుందే!"

".............." నవ్వుతుంది.

"ఇక్కడ ఆగ్యావేం?"

"ఇదే మా ఇల్లు"

"కాదు"

"నిజంగా"



"నీ పేరు"

"పార్వతమ్మ"

"..............."

"మీకు నామీద కోపం వచ్చిందనీ నేను వచ్చిపిలుస్తే వస్తారో లేదో నని ఈ వేషం వేస్యా."

"సరే సంతోషం........ ఎట్లానైతేనేం కలుసుకున్నాం. ఇదే పదివేలు. కాని ఇదేమిటి తాళాలు పగిలివున్నావేమి. పనివారందరేరి!?"

"పనివాండ్లను మిమ్ముల్ని వెతకటానికి పంపించి నేను వెతుక్కుంటువచ్చా. నాకేమి తెలియదు."

"కొంపమునిగింది. నేను పొయ్యేటప్పుడు విభూతి (పౌడర్) తయారుచేసే పదార్థాల పట్టిక. దాన్ని తయారుచేసే విధానాన్ని తెలిపేకాగితం దాచిపెట్టలేదు. అదే పాయెనా మననోట్లో మన్నే."

"..............."

శంకరయ్యగారు కాగితం దాచినచోటికి సరాసరి వెళ్ళారు. అది పెట్టినచోట లేదు. తయారైన బూడిద కూడా మాయమైంది. నెత్తికొట్టుకొని ఊరుకున్నాడు. పాపం పార్వతమ్మ మాత్రం తన మొగనికి తనతో కావలసినంత మాట్లాడేందుకు సమయము దొరుకుతుందిగా అని మాత్రం లోలోపల సంతోషపడ్డది. కాని పైన మాత్రం ఆర్భాటం చూపింది.

౮

కృష్ణయ్యగారింట్లో పెద్దపండుగ మోస్తరుంది. తెలిసినవారికి తెలియనివారికి 'దావత్' చేయించాడు. సత్యమ్మగారి సంతోషానికి పట్టపగ్గాలు లేవు. కనబడ్డావిడకల్లా ఒక డబ్బెడు పౌడర్ ప్రజెంటు చేస్తున్నది. పౌడర్ తయారుచేసే కిటుకే ఆమె పతి వద్ద వున్నాక ఆమెకేమి కొదువు చెప్పండి.

పౌడర్ చిటుకాపహరణం చేసిన కృష్ణయ్య ముసిముసి నవ్వులు నవ్వుతూ కూచున్నాడు. జరిగినసంగతి శంకరయ్యకు తెలిస్తే.... తాను ఖర్మంజాలక అతనికంటనే బడితే..... బుర్ర పగులుతుందనే భయం మాత్రం అతనిమనసులోనొక మూల రఘడిపిస్తూనే వుంది. కాని ఎప్పుడూ సంతోషపెట్టలేని భార్యను సంతోషపరచగలిగినందులకు మాత్రం తనమట్టుకు తాను ధన్యుడనుకొన్నాడు.

అయిందేమో మంచికే అయింది. ఇటు పార్వతమ్మ, అటు సత్యమ్మ ఇద్దరూ సంతోషించారు. కాని మీరు మాత్రం సత్యమ్మను సంతోషపెట్టడానికి కృష్ణయ్య చేసిన చోరీని శంకరయ్యకు గాని ఆయన దోస్తుదార్లకు గాని చెప్పకండి సుమా! కొంపమునుగుతుంది. మళ్ళీ 'సివిల్‌వార్' సిద్ధమవుతుంది.

***

*'కాళోజీ కథలు' అణాగ్రంథమాల ప్రచురణము 24 – ఏప్రిల్ 1943*



# లంకా పునరుద్ధరణ

చారిత్రక పరిశోధక మండలివారు కిష్కంధలో పరిశోధనలు జరుపుచుండగా వారికి లంకాదేశపు భూషణములు, బంగారు ఇటుకలు దొరికెనట. వాటి వివరాలేవో తెలిసికొందామని నాకు కుతూహలము కలిగినది. మా ఊరిలోని శతవృద్ధులైన పురాణ మార్తాండాచార్యుల వద్దకు పోయి విచారించితిని. వారు 'అజ్ఞాత రామాయణము'లో ఉన్నదని ఈ కింది విషయమును సెలవిచ్చిరి.

రావణ సంహారము జరిగిన తరువాత లంకారాజ్యము విభీషణునికి ఇవ్వవలెననుకొన్నాడు రాముడు. ఆ విషయము తన అనుచరులతో యోచించినాడు. తప్పక ఇవ్వవలసినదే అన్నారు అందరున్నూ. రావణునితో వ్యతిరేకించి విభీషణునితో పాటు రాముని పక్షము చేరినవారందరు సంతోషపడ్డారు. రావణుని పక్షాన ఉన్న పెద్దపెద్ద రాక్షసులు చాలామంది యుద్ధములో చచ్చినారు. మిగిలిన వారిలో ముఖ్యులు బందీలుగా ఉన్నారు. తక్కినవారు ఏమీ చేయలేక లోలోపల కుమిలిపోతూ పైకిమాత్రం "రామ రామ" అని భక్తిని నటిస్తున్నారు.

మైరావణ బలగము, మారీచుని బలగము అక్కడక్కడ మాయయుద్ధాలు చేస్తూ చేజిక్కిన విభీషణుని అనుచరులను రాముని కోతులను పట్టి చంపుచున్నవి.

ఈ దుష్ట బృందాన్ని రూపుమాపేవరకు లంకలో సంపూర్ణ శాంతి చేకూరుట అసంభవము. అంతవరకు లంకారాజ్యము విభీషణునికి అప్పజెప్పడము సబబు కాదు అని అధికారవర్గము నొక్కిచెప్పెను. రామునికి కూడ ఈ మాట నిజమనిపించెను. వేగులవారిని పంపి లంకాసమాచారాలు తెలిసికొన్నాడు. లంకలో విభీషణుని బలగమునకు రాజ్యము చేసే బలముగాని, అనుభవము కాని లేదని, లంకలో ఉన్న వారందరు రాక్షసులే అని తేలినది. మారీచుని బలగము, మైరావణుని బలగము నాశనమయ్యేవరకు లంకలోని రాక్షసుల నడవడి బాగుపడినదని తోచేవరకు విశ్వాసపాత్రులయిన తన వానరవీరులకే అక్కడి పెత్తనము అప్పజెప్పుట మంచిదని నిర్ణయించుకొన్నాడు రాముడు. విభీషణునికి ఈ సంగతి చెప్పగా అతడు మహాప్రసాదమన్నాడు. రాముడు తనమేలు కోరేవాడని గట్టినమ్మకము అది నిజము కూడాను.

హనుమంతుని పిలిచి "ఏమోయి హనుమంతుడా? లంక పెత్తనము తీసికొంటావా?" అంటే "స్వామి! నాకిటువంటి గొడవలేమీ తెలియవు. నేను నీ భక్తుడను. నిన్ను క్షణము వదలలేను. నీవు ఎక్కడ వుంటే నీ దాసుడు అక్కడ ఉంటాడు" అని చెప్పినాడు. సుగ్రీవుని పిలిచి 'నీకు తప్పద'న్నాడు రాముడు. అతడు 'మరి నా కిష్కింధనేమి చేయమంటారు మహాప్రభూ! నేనుండలేను. కాని మా మేనమామ ఇప్పుడు నాకు బదులుగా కిష్కింధలో రాజ్యం చేస్తున్నాడు. నేను అక్కడికి చేరగానే ఆయనను పంపిస్తాను. అతడు ఎక్కువ లోకానుభవం కలవాడు. ఇటువంటి సంధికాలాలు చాలా చూచినాడు. లంకలో అన్ని తెగలవారిని ఒకరేవులో నీళ్ళు తాగిస్తాడు. మేము చాలాకాలమునుండి ఇళ్ళు, వాకిళ్ళు విడచి ఉన్నాము. ఇళ్ళకు చేరగానే అక్కడ పనిలేక ఉన్న సమర్థులందరిని మామగారి సహాయార్థం ఇక్కడికి పంపిస్తాను. ఆరునెలలలో లంక దేవభూమిగా వెల్గిపోతుంది. మీరు నిశ్చింతగా అయోధ్యకు వేంచేసి పట్టాభిషేకము చేసుకొనండి. ఇక్కడి పరిస్థితి చక్కబడినదని వార్తరాగానే ఒక మంచి ముహూర్తాన అందరము వచ్చి విభీషణునికి పట్టము కట్టివేతాము" అనెను.

సుగ్రీవుని సలహా రామునికి పదుహారువీసాలు నచ్చినది. రాముడు తన పరివారముతో అయోధ్యకు ప్రయాణము సాగించినాడు. ఆయనతో విభీషణుడు బయలుదేరినాడు. సాగనంపుటకు వచ్చిన లంకాజనులకు విభీషణుడిట్లు చెప్పినాడు:

"శ్రీరాముని దయచేతను, మహాబలపరాక్రమ సంపన్నులయిన వానరవీరుల సహాయము చేతను మనలంకకు రావణునిపీడ వదలినది. కాని యింకను రాకాసితనము బొత్తుగా మాసిపోలేదు. దుష్టులక్కడక్కడ తలయెత్తుచున్నారు. అంతటను శాంతి కుదరలేదు. మనము అనుభవము లేనివారము. అందుకని మన లంకలోని దుష్టశక్తులనగద్రొక్కబడి పరిస్థితులు చక్కబడే దాకా ఇక్కడి రాజ్యభారము మీరే వహించండి అని శ్రీరాముని నేను వేడుకొంటిని. వారు నా మనవిని పాలించిరి. ఇప్పుడు శ్రీవారి అజ్ఞానుసారము సుగ్రీవులవారి మేనమామ గారు కొన్నాళ్ళపాటు లంకను ఏలెదరు. వారికి సహాయముగా కిష్కంధ నుండి మరియు అయోధ్య మొదలగు ప్రాంతాలనుండి ఎందరో కొమ్ములుదిరిగిన పెద్దలు వచ్చెదరు. మీరందరు వారి కనుసన్నలలో మెలగుచు, దుష్టులను అణచుటలో, లంకలో నాలుగుమూలలా శాంతి నెలకొల్పుటకు వారికి అన్నివిధాల తోడ్పడండి. వారు మనలను ఉద్ధరించవచ్చిన దేవతలని మరువకండి. వారికేవిధమైన కొరత జరుగరాదు. అది



నా కోరిక. మీరందరు మన్నింతురని ఆశించుచున్నాను" అని చెప్పి రామునితో పాటు అయోధ్యకు వెళ్ళినాడు.

సుగ్రీవునిమామ లంకకు అధిపతి అయినాడు. సుమంతుని మేనల్లుడు మంత్రి అయినాడు. కిష్కింధలోని చిన్నకోతులు, పెద్దకోతులు తండోపతండములుగా వచ్చి చేరినవి. అధిపత్యములు, అధికారములు పంచుకొన్నవి. విభీషణుని అనుచరులు వచ్చినవారందరికి అతివైభవముగా స్వాగతము ఇచ్చినారు. రావణ సంఘమునకు కూడ ఆ స్వాగతోత్సవములో పాల్గొనక తప్పలేదు. కొన్నాళ్ళపాటు ఉత్సవములతోనే గడిచినది.

అక్కడ అయోధ్యలో రాముడు, కిష్కింధలో సుగ్రీవుడు తమ తమ రాజ్యకార్యములో నిమగ్నులై ఉన్నారు. సుగ్రీవుని మామగారు లంకలోని తన పరిపాలనావివరములను ఎప్పటికప్పుడు సుగ్రీవునకందజేయుచున్నాడు. సుగ్రీవుడు అయోధ్యకు ఆ విషయాలు తెలుపుచున్నాడు.

లంకలోని రాక్షసులు కొత్త దొరలకు విందులు జేసినారు. వానరులెరుగని ఎన్నియో భోజనపానీయములను వారికి రుచిచూపినారు. కానుకలరూపముల బంగారు ఇటుకలపై 'రామ రామ' అని చెక్కించి సమర్పించుకొన్నారు. చెట్లపై, గుట్టలపై నివాసము చేసే వానరులకు లంక ఇంద్రలోకమువలె కనిపించినది. వారధి గట్టునపుడు రాళ్ళు గుట్టలు మోసినట్లే వీరు లంకలోని బంగారు ఇటుకలను కిష్కింధకు చేరవేసినారు. కిష్కింధలో ఉయ్యెల గొలుసులు, కుండలమీది మూతలు కూడా బంగారువే. ఆడకోతులు పిల్లలకు మారుగ బంగరుయిటుకలనే ఎదలకద్దుకొని తిరుగసాగినై. బాంగారు యిటుకలకు తొళ్ళుకొట్టి తోకలకెక్కించుకున్నై. తిరుగులాడునపుడు ఆభరణములుగాను, కూర్చున్నపుడు పీటలుగాను ఉన్నాయి ఆ యిటుకలు. కిష్కింధలో నిన్నటిదాకా నిరాడంబరముగా బ్రతికినవానరులకు లంకలోని అధికారపు కైపు, మద్యపానపు మత్తు, ఎన్నడూ చూడని ధనరాశులు కలిగించిన దురాశ ఒకేసారి దాపురించినవి. వాటితోపాటు అక్కడి అందమయిన ఆడవాళ్ళ యౌవనధనము కూడ వానరుల చూపులను ఆకర్షించినది. లంకను విడచుటయన్న ప్రాణము విడుచుటవలె అయినది.

ఈ దుర్ఘటనలన్నియు విభీషణుని అనుచరులకు దుర్భరమైనవి. వారు చాటుమాటుగా గొణగసాగినారు. ఒకరిద్దరు సాహసించి సుగ్రీవుని మామగారితో చెప్పినా లాభము లేకపోయినది. ఈ వార్తలు అయోధ్యలో ఉన్న విభీషణునికి చేరినవి.

అతనికెంతయు ఆశ్చర్యము, విషాదము కలిగించినవి. రాములవారితో ఈ విషయం మనవిచేస్తే వారు నమ్మలేకపోయినారు. అయినను సుగ్రీవుని "నిజానిజాలు తెలిసికొని వెంటనే తమకు తెలుపుము"ని తాకీదు వ్రాసినారు. సుగ్రీవుడు తన మామగారిని "ఏమిటి ఈ సంగతి" అని విచారిస్తే, వారు స్వయంగా కిష్కింధకు విచ్చేసి ఇట్లు చెప్పిరి:

"ఇది అంతా లంకలోనివాళ్ళు చేసినకుట్ర. అక్కడి దుష్టశక్తులను అణచుటకు మేము కాఠిన్యము వహిస్తున్నాము. దాని నుండి తప్పించుకొనుటకుగాను వారు ఆ ఎత్తులు వేయుచున్నారు. వారంతా దుష్టకూటములోనివారు. వారిది మారీచుని తెగ. మైరావణ బలగము. పైకిమాత్రం రామనామస్మరణ చేస్తుంటారు. ఇది నేను అనుభవపూర్వకంగా చెప్పుచున్నాను."

సుగ్రీవుడు మామగారి మాటలను ఉన్నది ఉన్నట్లు రాములవారికి తెలియపరచెను. రాముడు విభీషణునితో విషయమంతా చెప్పి "విన్నావా సంగతి? మీవారే వేస్తు ఉన్నారు ఈ ఎత్తులు. నేను లంకలో వ్యవహారాలు చక్కబెట్టుటకు పంపినవారు సామాన్యులు కారు. వారందరు దేవతలు. రావణ సంహారమునకు నాకు తోడ్పడుటకు వానరులుగా జన్మించినారు. మీ లంకలో పుట్టినవాళ్ళందరు రాక్షసులేయని నాకు చారులవలన తెలిసినదే నిజమని తోచుచున్నది. ఇకనైన ఇటువంటి వార్తలు నమ్మకు! ఇటువంటి దుష్ప్రచారములు చేయవద్దని మీ వాళ్ళను మందలించుము"ని అనెను. పాపము! విభీషణుడు ఈ మాటలకు నోరెత్తజాలలేదు. సిగ్గుతో తలవంచుకొనెను. శ్రీరాముడు సుగ్రీవునికి వ్రాసినట్లే సుమంతుని మేనల్లునకు కూడా వ్రాసెను. అతుడును సుగ్రీవుని మామవలెనే సమాధానమిచ్చెను. విభీషణునకు ప్రాణసంకటముగా ఉండెను. లంకనుండి తనవారు పంపుచున్న వార్తలు రానురాను మరింత ఆందోళనము కలిగింపసాగెను. తాను లంకను విడిచి దాదాపు ఆరునెలలు కావచ్చినది. ఇక అతడు అయోధ్యలో ఉండలేకపోయెను. సత్వరమే లంకచేరెను. అచటి పరిస్థితులు నిజముగానే భయంకరరూపము దాల్చియుండెను. లంకలో రావణుని అనుయాయులైన రక్కసులెవరో రాముని నమ్మినబంటులైన వానరులెవరో చెప్ప వీలులేకుండెను. భేదము కేవలము రూపమునందే మిగిలింది. ఏ మాత్రము ఆలసించినను సర్వనాశనము తప్పదని విభీషణుడు నిలుచున్నపాటున రాముని యొద్ద వ్రాలెను.

అక్కడ అప్పటికే సీత వాల్మీకి ఆశ్రమము చేరుకోవడము, ఆమె వియోగము భరింపలేక రాముడు కృశించి పోవడము జరుగుచున్నది. ఇటువంటి విషమ



సమయమున తన దురవస్థ వినిపించలేక విభీషణుడు కొన్నాళ్ళదాకా మాట్లాడక కూర్చున్నాడు.

ఒకనాడు రాముడే స్వయముగా విభీషణునితో "లంకా విశేషములేమిటి?" అని ప్రశ్నించినాడు. విభీషణుడు తాను కళ్ళారా చూచివచ్చిన అరాజకమంతా వివరంగా విన్నవించి రెండుకాళ్ళు పట్టుకొని, "స్వామీ, తామొకసారి స్వయముగా దయచేయనిదే మాకు ముక్తిలేదు" అన్నాడు.

సీతా వియోగమున అన్నిటియందును విరాగము కలిగినను, రాములవారికి శరణాగతులను రక్షించే వ్రతము మొదటినుండి యున్నందున, వెంటనే లంకచేరి అచ్చటి పరిస్థితులు చూచెను.

సుగ్రీవుని మామను, సుమంతుని అల్లుని ఒకే త్రాటితో కట్టి సముద్రములో ముంచనాజ్ఞాపించినాడు. రాక్షసులతో కుట్రలు పన్నిన తక్కిన వానరులకు తగినశిక్షలు విధించినాడు. తరువాత విభీషణునకు పట్టముకట్టి అక్కడి ప్రజలను ఓదార్చి అయోధ్య చేరుకున్నాడు.

***

*పరిసరాలు, రెండవభాగం*

*17 కథకులు 17 కథలు దేశొద్ధారక గ్రంథమాల*

# ఆగష్టు పదిహేను

త్రయోదశ స్వాతంత్ర్యోత్సవము - **1959**

*మహాశవం అంత్యక్రియలు*
*స్వాతంత్ర్య సరోవరంలో సూతకస్నానం*

శిష్ట సంరక్షణార్థం, దుష్టశిక్షణార్థం, సాక్షాత్ పరమేశ్వరుడు అవతారాలెత్తే మన పుణ్యభూమిలో మత్స్య, కూర్మ, వరాహాద్యవతారముల తర్వాత యుగంమారి కలియుగం ప్రవేశించిన కొన్నివేల యేండ్లకు భారతావని సామ్రాజ్యపిశాచాల వాతపడి సతమతమౌచుండగా - మూకప్రజానీకమును రక్షింప ఈశ్వరాంశ ప్రజాసంస్థలో ప్రవేశించి కాంగ్రెసుగా అవతరించినది.

అవతరించిన ఈశ్వరాంశకున్నూ, సామ్రాజ్యపిశాచానికిన్నీ అరువదేండ్లు హోరాహోరి పోరు జరిగిన తర్వాత 1947 ఆగష్టు 14-15ల మధ్య రాత్రి, పిశాచ ఘడియలో సామ్రాజ్యాధికార పైశాచిక శక్తి అంతరించింది. అవతారమెత్తిన కార్యం పూర్తికావడంతోనే అదేక్షణంలో కాంగ్రెసు సంస్థలోని అవతారాంశ కూడా అంతర్ధానమైంది.

అవతారముయొక్క పుట్టుపూర్వోత్తరాలు ఎరిగిన రాజకీయ వ్యాసభగవానుడు సంతుష్టుడై -

"దైవాంశరహితమైన సంస్థ భౌతికశరీరానికి అంత్యక్రియలు జరపండ"న్నాడు.

సంస్థలోని దైవాంశమీదికన్న దాని భౌతికశరీరంపైన యెక్కుడు మాయ మమత గల పామర భక్తాగ్రేసరులు, శిష్యకోటి లోని ముఖ్యాతిముఖ్యులు, కాంగ్రెసు శరీరంపై బడ్డారు. దాన్ని గట్టిగా కౌగిలించుకున్నారు.

"శవానికి అంత్యక్రియలు తొందరగా జరగాలె. దాన్ని వదలండి. పామరులవలె ప్రవర్తించకండి. మీ పురుషార్థముపై నిలవద్రొక్కుకొని దొరికిన రాజకీయ స్వాతంత్ర్యాన్ని కాపాడుకోండి. అవతారం చాలించిన తర్వాత మిగిలిన శవం మీకు యేమాత్రం తోడ్పడదు. పామరజనానికి అవతారరహిత శవంపై భక్తిభావం పెరుగుతుంది. అవతారం చాలించిన శవాన్ని పామరులను మోసగించ



ఉపయోగించుకుంటారు స్వార్థపరులు. శవం కుళ్ళుతుంది. కుళ్ళిన శవం మిమ్ములగూడ కుళ్ళుపాలు చేస్తుంది. ప్రజల మౌఢ్యంపైననే ఆధారపడిన మీకు యెల్లపుడు వారి మౌఢ్యం పైననే ఆధారపడవలసి వస్తుంది. అవతారమహిమల చాటి చాటి, శవప్రదర్శనం చేసి చేసి ప్రజానీకాన్ని మోసపుచ్చకండి. మీ మీ స్వంతపురుషార్థంపై ఆధారపడండి. శవమహిమపై ఆధారపడితే మీ వ్యక్తిత్వం రాణించదు అది చివికిపోతుంది."

అని ఆ వ్యాసుడెన్నో తీరుల నచ్చజెప్పినాడు శిష్యులకు. అప్పటికే శవభక్తి శిష్యులనావరించింది. వ్యాసుని మాట వారికి నచ్చలేదు.

"మేము యింతమంది వారసులముండగా శవం కుళ్ళుతుందా? మురుగుతుందా? మా సర్వస్వం పన్నీరుగాబోసి దాన్ని కాపాడుకుంటాం. మేము సగుణోపాసకులం, అవతారం చాలించినా కొన్నాళ్ళపాటు అవతారాంశ సంభూతమైన ఈ శవం చాలు- మాకు అన్నివిధాల తోడుపడడానికి శవపూజలు ప్రారంభమైతే అవుతాయి. మన పుణ్యభూమిలో దేనికి జరుగలేదు పూజ? దేనిని పూజించి జనం తరించలేదు? మన పుణ్యభూమి పుణ్యమే మమ్ములను శవభక్తులుగా రాణింపజేస్తుంది. అవతారం చాలించిన శవం యిది, అని అందరికి తెలియదు. వారందరికి యీ విషయం నచ్చజెప్పడం కష్టం. అవతారాంశ మిగిలి ఉన్నదనే భ్రమే చాలు పామరజనానికి. వారా భక్తితో పూజ్యభావంతో పరవశులై అవతారమహిమలను వింటారు. అవతారకాలంలో అవతారముయెడ భక్తిశ్రద్ధలతో మెలిగిన మేము, సామ్రాజ్యపిశాచంతో పోరాడిన అవతారానికి అన్నివిధాల సాయపడ్డమేము, చేజిక్కిన స్వాతంత్ర్యాన్ని అవతారాంతమున కేవలము స్వశక్తితో కాపాడుకోగలమా? అధికారాన్ని మా పేరుతో సంపాదించుకోగలమా? అట్టి సామర్థ్యం మాకున్నదా? కాబట్టి శవంపై మేము కూడా ఆధారపడక తప్పదు. ప్రజలు అవతారం వున్నట్లే భ్రమ పడేటట్లు మేము చూచుకుంటాము. వారు ఆ భ్రమతోనే శవానికి పట్టం కట్టుతారు. శవరాజ్యాభిషేకం జరిపి, ఆ శవ ప్రతినిధులుగా మేము అవతారం పేర అధికారం చలాయిస్తాము. మీరు మమ్ములను ఆశీర్వదించండి" అన్నారు శిష్యులు.

వ్యాసుడు చాలా నొచ్చుకున్నాడు. సత్యాహింసల యేబదేండ్ల కృషి క్షణంలో మసైపొయ్యే సమయమాసన్నమైనట్లాతడు తెలుసుకున్నాడు. కోపంతో, దుఃఖంతో తిరిగి శిష్యుల చీవాట్లు పెట్టినాడు. 'ఇది ధర్మం కా'దన్నాడు.

"మీరన్నట్టు జరగకుండా నేనే శవానికి అంత్యక్రియలు జరుపుతా"నన్నాడు.

శిష్యులు వ్యాసుణ్ణి యెదిరించినారు. 'శవం వదల'మన్నారు.

'శవానికి అంత్యక్రియలు జరుపుతే మేమంతా సహగమనం చేస్తా'మన్నారు.

వ్యాసుడనుకొన్నాడు, 'కానున్నది కాకతప్పదు' అని.

"సరే, దేశ దౌర్భాగ్యానికి నేనేమి చేస్తాను? మీ యిష్టం వచ్చినట్లు యేడ్వండి. నన్ను మాత్రం ఆ పాపంలోకి యీడ్వకంటి. నేను శవజాగరణ చేస్తూ కూర్చుంటాను. శవానికి అంత్యక్రియలు జరిగేదాకా నాకు శాంతిలేదు"

అంటూ తపస్సుకై ఎచ్చటికో వెళ్ళిపోయినాడు.

శవానికి పట్టంగట్టి ఊరేగించినారు మూఢభక్తులు. సింహాసనంపైన ఉంచితేమాత్రం శవం కుళ్ళకుండా ఉంటుందా? అది కుళ్ళసాగింది. దుర్వాసన-భరింపరాని కంపు బయలుదేరింది. అదేం సామాన్యశవమా? అవతారాత్మ చాలించిన మహాశవం అది. దేశమంతటా దాని కుళ్ళు వ్యాపించింది. అవతారకాలంలో ప్రభావితులు కానివారు కూడా శవం దుర్గంధానికి శిగముబూని లేచినారు. కుళ్ళిన కాయం అవయవాలు ఊడబెరికి తమతమ ప్రాంతంలో పట్టంగట్టినారు. మహాశవం మహావయవాలు మరింత కుళ్ళి ఎన్నో మహాజాడ్యాలకు మంత్రసానితనం చేసినాయి. భక్త్యావేశంతో మూఢులు మహాజాడ్యాలను అవతారాంతర మహత్యాలుగా స్వీకరించినారు. రాజకీయవ్యాసుడు శవజాగరణ చేస్తూ చేస్తూ అంత్యక్రియలు చేయజాలని పాపాన్ని ఒడిగట్టుకుని బాధపడుతుండగా 'పిట్టనెపం'తో కిరాతకుడు పుణ్యం కట్టుకున్నాడు.

శవభక్తులు వ్యాసుని కాయానికి బ్రహ్మాండంగా అంత్యక్రియలు జరిపి వ్యాసనామామృతాన్ని దేశవ్యాపిత పట్టాభిషిక్త కాంగ్రెసు కళేబరపు కుళ్ళుపై జల్లి అవతారకాలపు ప్రాణప్రతిష్ఠ జరిపినంతపని చేసినారు. మామూలు కళేబరానికి పిట్ట యెగిరిపోయినాక యేమి చేసినను లాభములేనప్పుడు అవతారం చాలించిన మహాశవం లేచికూచుంటుందా? లాభంలేకపోయింది, తాత్కాలికంగా కుళ్ళు పోయినట్లనిపించింది. అమృతప్రభావం, నామామృత ప్రభావం దొంగభక్తుల నోటినుండి బైటపడ్డ తుంపర్లవలెనే ఆరిపోయింది. కుళ్ళు మరింత రేగింది. స్వార్థవాయువులు వింజామరలు కాగా, కుళ్ళు మహాజాడ్యఝంఝూ రూపం దాల్చింది. భక్తులను అపాదమస్తకం ఊపేసింది. వ్యాసకాలీనులు కొందరు పెద్దలు (అవతారం చాలించిన మహాశవానికి అంత్యక్రియలు జరపాలని వ్యాసునితో ఏకాభిప్రాయులైన



వారు) ప్రాణాయామం మొదలుపెట్టి సమాధ్యస్థులైనారు. వారిని శవభక్తులు చచ్చినవారితో జమ కట్టినారు. ముక్కులు మూసుకున్న కొందరు బుద్ధిమంతులు అప్పుడప్పుడు 'కుళ్ళు' 'కుళ్ళు' అని అరిస్తే శవభక్తులు వారి ముక్కులు మురిగినవన్నారు. దేశవ్యాప్తమైన మహాశవ దుర్గంధంలో సామాన్యజనులు కూడా ఉక్కిరిబిక్కిరి అయిపోయినారు. మూఢభక్తితో యెన్నాళ్ళని ప్రాణాలు బిగబట్టుకుంటారు పాపం. చాటుగ సుగంధద్రవ్యసహాయంతో అప్పుడప్పుడు దుర్గంధాన్ని సుగంధము చేసుకున్నామన్న భ్రమతో సుగంధాఛ్చిత దుర్గంధాన్నే పీల్చసాగినారు.

ఇంతలో స్వరక్షణార్థము సమాధ్యస్థుడైన వ్యాసకాలీనుడొకడు జనసామాన్య రక్షణార్థమై కన్నులు తెరచి

"యిక ఈ అన్యాయం భరింపలేను. పన్నెండేండ్ల తర్వాతనైనా సరే, మహాశవానికి, అది వ్యాపింపజేసిన దుర్గంధానికి అంత్యక్రియలు జరుపవలసిందే. లోక రక్షణార్థము ఆ పని జరుగకతప్పదు. శవభక్తులు సహగమనం చేసినా ఆ పని జరిగి తీరుతుంది. వ్యాసుని అంతర్యాన్నెరిగినవాణ్ణి. నా మాట వినండి. కుళ్ళుతో బాధపడేవారందరూ కుళ్ళును కుళ్ళని చాటండి. కుళ్ళును కుళ్ళంటే అవతారం చాలించినవారిని అవమానించడం యేమాత్రమూ కాదు. శవానికి అంత్యక్రియలు జరుపలేని వ్యాసుడే పాపాన్ని ఒడికట్టుకొని ప్రాయశ్చిత్తముగా ఆత్మార్పణ చేసుకున్నాడు. ఆ పాపం దేశాన్ని కూడా చుట్టుకున్నది. లేవండి. నడుములు బిగించండి. పుల్ల పుడక- యేదైనా తెండి. చితిపేర్చండి. మహాశవం యొక్క కుళ్ళిన అంగాలన్ని సేకరించి చితిలో వేయండి. అన్నీ ఒక్కచోటికి తేవడం కష్టమైతే శవాంగం యెక్కడ ఉంటే అక్కడ నాలుగుపుల్లలు పడవేసి కాల్చండి. శవం యింట్లో పెట్టుకొని యెన్నాళ్ళు బాధపడదాం? నేడు మూఢభక్తికి విసర్జన. భావస్వాతంత్ర్యానికి ప్రాణప్రతిష్ఠ.

ఇది మహోద్యమం

మహాజనుల ఉద్యమం నేను ప్రారంభిస్తున్నాను.

వ్యాసుని ఆత్మకు శాంతి చేకూరుతుంది.

మహాశవానికి అంత్యక్రియలు జరుగుతాయి. ఇదిగో ఈ కాష్టానికి నిప్పంటించుచున్నాను". అన్నాడు.

అతడు వ్యాసకాలీనుడు. సమాధ్యస్థుడైనవాడు. జాగ్రదావస్థలో అందరికి తెలియచాటినాడని తెలిసికొని స్వాతంత్ర్య దాతయైన కాంగ్రెసు అవతారపురుషుడు అవతారం చాలించిన 13వ నాడు 'నాగొడవ'గా 'కాళోజి' తెలియజెప్పగా విని 'రాజాజీ గొడవ కూడా ఇదే'నన్నాడు శాస్త్రి.[1]

ఈరోజు సూతకము పోయినరోజు. అంతా స్వాతంత్ర్యసరోవరంలో స్నానంజేసి స్వతంత్రులై క్షేమంగా బ్రతకండి!

ఇది 15వ ఆగష్టు. మహాశవానికి అంత్యక్రియలు నేడే. స్వాతంత్ర్యసరోవరంలో సూతకస్నానం కూడా ఈరోజే. త్రయోదశ స్వాతంత్ర్యోత్సవం జరుపుకునేవిధానం ఇది.

మనకేమని అనరాదు.
మనది కానిదేమున్నది?
దేశము దేశయులదే
దేశీయులమన్న మనమే

***

*(1959 ఆగస్టులో 10,000 ప్రతులు ఉచితంగా పంచిపెట్టటం జరిగింది)*

1. శ్రీ యం.వి. శాస్త్రి, కాకినాడ - 1959 ఆం.ప్ర. కౌన్సిల్‌లో కాళోజీ సహసభ్యుడు



## ఎన్నిక కథ

అనగా అనగా ఓ రాజు, ఆ రాజుకు ఒక కూతురు. ఆమె యుక్తవయస్కు-రాలైంది. రాకుమార్తెకు తగిన విద్యాబుద్ధులు నేర్పించి, వివాహ విషయమై రాజు 'స్వయంవరం' నిర్ణయించినాడు. రాజుకు సరిపడినవారు, సరిపడనివారు ఎందరెందరో 'స్వయంవరం' నాటికి మండపంలో హాజరైనారు. రాకుమార్తెకు, హాజరైన అభ్యర్థుల యోగ్యతలన్నీ తెలుపబడ్డాయి. ఆమె తన భావి భర్తను - వారిలోనొకనిని తనకు నచ్చిన వానిని ఎన్నుకొనే ప్రయత్నములోనున్నది. పూలహారం చేతిలో తీసుకొని మండపంలోకి ప్రవేశిస్తున్నది. ఇంతలో ఆమె అన్నగారు ప్రత్యక్షమై ఆమె చెవిలో ఊదినాడు - "ఫలానాచోట కూర్చున్న ఫలానా అభ్యర్థి మెడలో పూలమాలవేయి. లేకున్న నీకు నాకు నేటితో తెగతెంపుల"ని.

పాపం రాకుమార్తె నిలువునా స్తంభించిపోయింది. ముందుకు అడుగు వేయలేకపోయింది. ఒకవేపు తన స్వయంనిర్ణయాధికారం, మరొకవేపు అన్నగారి బెదిరింపు - ఆమె ఏమి చేయాలో మీరే ఆలోచించి చెప్పండి. రాకుమార్తె తన "స్వయం నిర్ణయాధికారా"న్ని ఉపయోగించిందో, అన్నగారి ఆజ్ఞ శిరసావహించిందో..

(సశేషం)

***

*గోలకొండ ముద్రాక్షరశాల, హైదరాబాదు (ఎ.పి.)లో ప్రచురించిన కరపత్రంలో భాగం.*

# రెండు గింజలు

(మరాఠీ నుండి)

బాగా ఎదిగిన ఆ జొన్న చేనులో ప్రతికర్ర, తలపైనొక పెద్దపాటి కంకితో, ఠీవిగా నిలబడి యుండెను. ఒక కంకిలోని ఒకదానికొకటి అంటియున్న రెండుగింజలు, అవి రెండును ఒకచోటనే పుట్టి ఒకే వాతావరణంలో పెంపొందుచున్నను జీవితములోని ఒకేవిధమగు ఘట్టముల పరిణామము మాత్రము వానిపై వేరువేరుగానుండెను.

ఒక గింజ ఇట్లా గొణుగుకొనుచుండెను: "ఇట్లెన్నాళ్ళు గడపవలెను? జీవితముపై రోత పుట్టుకుచున్నది".

ఇదేమి అనుకొనుచున్నదో ప్రక్కనున్న సంతోషహృదయయగు నా రెండవ గింజకు బోధపడనేలేదు. అది ఇట్లనుచుండెను;

"ఎంత ఆనందంగా వుంది. ఈ జీవితమే ఒక గమ్మత్తు. అదిగో ప్రతిరోజు వచ్చు ఆ పిట్ట వచ్చుచున్నది చూడు. ఈ రోజైన మనకర్రపైన వాలునో లేదో. ఒడిసెల రాయి రంయ్ అనగానే బుర్రని ఎగిరిపోతుంది వట్టి పిరికిది. హ...హ...హ."

"కాని, దాన్ని చూస్తె నాకెక్కడ లేని భయం" అని మొదటి గింజ తెలతెలబోవు ముఖంతో ననెను.

"ఎందుచేత?" రెండవగింజ ప్రశ్నించెను.

"మొన్ననే నా ప్రక్కనున్న గింజనెత్తుకొని పోయింది. అప్పుడు కఠినమైన దాని ముక్కు కొన నాకు తగిలింది. నేడు మన వంతో ఏమో?"

"అని నీవు ఇప్పటినుండియే ఏడుస్తున్నావన్నమాట. మనలను ఎత్తుకపోతే పోనీ. ఏమి జరుగుతుందో చూతామప్పటిదప్పుడు. అదిగో విను, కోకిల ఎంత హాయిగా కూస్తున్నదో. మన చేనుపైన ఎప్పుడును వాలదు, ఎందుకో. 'కూహూ, కూహూ,కూహూ'.

రెండవ గింజ ఈ మాటలు చెప్పుచుండగనే చిన్నపాటి గాలి విసరెను. కర్రలన్నియు మరలిపోవు నీటి తడలవలె క్రిందికి వంగి మరల లేచెను.



"ఎంత హాయిగా ఉంది వుయ్యాల... బలే జంపాల" అని రెండవగింజ ఆనందంగా పాడమొదలిడెను."

"నాకు భయం చేత కంపమెత్తుచున్నది. భూమిపై పడిపోతానేమో అనుకొన్నా" మొదటి గింజ వణుకుతూ అనెను. కాని ఆ రెండవ గింజ హా హా హా అని నవ్వు చుండెను.

ఇంతలో ఆ పిట్ట అచ్చటికి వచ్చెను. 'చూడు చూడు' అన్నట్లు ఆ గింజలున్న కర్రపైన వాలెను.

"దీని కాళ్ళతో నాకు చక్కలిగింత యగుచున్నది" అని రెండవగింజ యనెను. మొదటిగింజ భయముచే మాట్లాడలేకపోయెను.

"ఎంత గమ్మత్తుగా వుంది ఈ పిట్ట. దీని..." అని రెండవగింజ అనుచుండగనే ఆ పిట్ట ఒకేసారి ఆ రెంటిని నోటబెట్టెను. ఇంతలో మంచెపయినుండి ఒడిసెల రాయి రంయ్ అని వచ్చెను. ఆ రెండు గింజలు పిట్టనోటిలోనే ఉండెను. రెండవ గింజ పిట్ట పిరికితనాన్ని జూచి నవ్వుకొనుచుండెను. మొదటి గింజ మాత్రము చావుభయముతో వణుకుచుండెను. అది తత్తరబాటుతోనిట్లనెను.

"ఇది మనలను చీల్చి పొట్టబెట్టుకొనును గదా?"

రెండవగింజ ఇట్లు పలికెను. "మరి దానికి నీవు చేయునదేమి? దాని పొట్టజీల్చి మరల కంకిని జేరెదవా? దానిపిల్లలు గూడు సంసారం జూచుటకవకాశమన్నా దొరుకుచున్నది గదా. చూడు ఎంత వేగంగా పరుగెత్తుచున్నదో మనలను తీసుకొని. కాని వట్టి పిరికిది. ఒడిసెల రాయి భయంచేత దీని గుండె ఇంకా దడదడ కొట్టుకొంటూనే వుంది."

"ఎంత ఎడ్డిదానవే! చస్తున్నా వింతలు విపరీతాలు అగుపడుచున్నాయి నీకు" అని మొదటిగింజ హేళనగా ననెను. పిట్ట అతివేగంగ తనగూటివైపుకు ఎగిరిపోవుచుండెను. దాని ధ్యానమంతయు గూటికి తాను జేరగానే కిచకిచమని గోలజేయు పిల్లలపైనుండెను. అందరివలెనే ఆ పిట్ట సహితము అకస్మాత్తుగా వచ్చు ఆపద ఎరుంగనిది కావున యింటికి జేరు ఆనందోత్సాహములే దానిని గూటివైపున అతివేగంగా తీసుకొని పోవుచుండెను. ప్రక్కనుండి ఒక డేగ రంయ్ అని వచ్చి ఒక్క తన్నుతో పిట్ట యొక్క సుఖస్వప్నాన్ని ధ్వంసము జేసెను. డేగ పిట్టను తన పంజా నడుమ గట్టిగా అదిమెను. పిట్ట కీచుమని నోరుదెరచెను. దాని నోటిలో ఆ రెండుగింజలు అట్లే అంటుకొనియుండెను. డేగ అతివేగంగా ఎగిరిపోవుచుండెను.

"పద ఇక్కడినుండి కిందికి ఒక గంతు వేశాం. పక్షి వలె గాలిలో విహరింపవచ్చును."

రెండవగింజ మొదటి దానితోననెను.

"ఒసే పిచ్చిదానా! ఇంతపైనుండి గంతులు వేసి చావమంటావా?"

మొదటిగింజ జ్ఞానబోధ జేయసాగెను. కాని ఇందంతా వినుటకు ఆ రెండవగింజకు వేళ ఏదీ? అది కిందికి దుమికెను. భూమిపై పడెను. మొదటిగింజను పిట్టతో బాటు దేగ తన పొట్టబెట్టుకొనెను.

***

కొన్నాళ్ళకు వాన కురిసెను. మరి కొన్నాళ్ళకు రెండవగింజ పడినచోట ఒక జొన్న కఱ్ఱ తలపైనొక పెద్దపాటి కంకితో గాలిలో హాయిగా యిటూ అటూ వూగుచుండెను.

***

తెలుగుతల్లి, సంపుటి ౧, సంచిక ౪

ఫిబ్రవరి 1940, పుష్య బహుళ ౮ గురువారము



# అనుభవములేని ఆందోళన

ఆ గుడ్లగూబ పిల్ల ఆనాడే కండ్లు తెరచెను. అన్నివైపుల ఎంతో అందమగు చీకటి క్రమ్ముకొని యుండెను. జగత్తంతా అతిప్రశాంతముగా నల్లనిసౌందర్యముతో విరాజిల్లుచుండెను. ఆ పిల్ల మెల్లగా, 'ఘూం' అని కూసెను.

'ఘూం', ఘూం' అని రెండవపిట్ట నుండి దానికి జవాబు దొరికెను. ఎంత మాధుర్యమగు కంఠము! తనయొక్కయూ, తనవలెనే కూసిన రెండవ గుడ్లగూబ యొక్క గాత్రము దానికెంతో ఆనందము గొల్పెను. ఎత్తయిన చెట్టుకొమ్మపైనున్న గూటిలో, చిన్నపాటి రెక్కలలో కాళ్ళు ముడుచుకొని, ముక్కుదాచుకొని అది సుఖముగా పడియుండెను. అందులోనె దానికి ఒక కునుకు పట్టెను.

ఇంతలోనే అది దద్దరిల్లి లేచెను. తూర్పుదిక్కున ఏదో చమత్కారమగు ప్రకాశవంతమైన ఎర్రనిరంగు వ్యాపించియుండెను. 'ఘూం' 'ఘూం' అంతకుముందు ఎంత అందమైన అంధకారము వ్యాపించియుండెను! ఎంత శాంతముగానుండెను. స్మశానములోని ప్రశాంతము, అప్పుడు తానెంత మాధుర్యముగా పాడుచుండెను...?

కాని ఇప్పుడు?

ఛీ! ఎంత భయంకరమగు తళతళ మెరయు ప్రకాశము? దీనిచే అందరూ నావలెనే అంధులయి యుందురు. ఇటువంటి వెలుతురులో ఎవరికయినా ఏమైనా కనబడునా? ఎల్లపుడూ ఆ అందమగు అంధకారమేల యుండరాదు. కష్టదాయకము తేజోమయమగు ఈ యుష్ణగోళమెక్కడనుండి దాపురించినది? మొదలు దీనిని లేకుండా జేయుటయే నావిధి.

తన చిన్నపాటి గూటిలో ఇటు అటు తహతహలాడుచూ, కనులు గట్టిగా మూసుకొని తల్లడిల్లుచూ బిగ్గరగా కూయసాగెను. 'కర్ణకఠోరముగా కిచకిచమను ఓ పక్షులారా! నోరుముయ్యండి అంతా, పాడదలచిన నావలె పాడండి. ఇంకో స్వరము దీయపనిలేదు. ఇక ఊరుకున్న పనిజరుగదు. నేను గొంతెత్తి అరచి, ఆ తేజోగోళమును విడిపించి తరిమెదను. నేను దానిని ప్రపంచముననే లేకుండా జేసెదను. ఇక చూడుడు నా ప్రతాపము'.

అని నోరుతెరచి గూటికొనకు వచ్చి, బిగ్గరగా కూయనారంభించెను. 'ఘూం... ఘూం.... ఘూం.... ఘూం'

ఒక గంట గడిచెను. అప్పటికి ప్రకాశము అంతకంతకు తళుకెక్కుచుండెను. దాని తేజము ఆ గుడ్లగూబకు సహనముగాకుండెను. అది నిరాశతో ఎలుగెత్తి అరచెను. 'ఘూం...ఘూం' కొంతసేపటికి కండ్లు తుడుచుకొని రెక్కలసందునుండి మెల్లగా పైకిచూసెను. ఏమి చమత్కారము! అప్పుడు తేజోవంతమగు గోళము ఒకవైపునుండి నల్లపడుచుండెనా? మరుక్షణముననే ఆ గోళములోని కొంతభాగము నరికివేసినట్లాయెను. దాని మునుపటితేజము తగ్గసాగెను.

ఆ గుడ్లగూబకెక్కడలేని ఆనందము కలిగెను. ఎంతో ఉత్సాహము కలిగెను. చుట్టుపట్లనున్న పక్షులనుద్దేశించి ఆవేశముతోనిట్లు పలికెను. 'అప్పుడు నన్ను హేళన చేయుచుంటిరి కదా. చూడుడు. ఇప్పుడు నా ప్రభావము. నా అరపు వల్లనే ఈ గోళము సగము అంతరించినది. మిగతా సగము అయిపోతు ఉన్నది. మూడుపాళ్ళు కూడా కావచ్చింది. ఉన్నది కాస్త కాజేస్తాను... అయిపాయె.... పేరులేకుండా పాయె... అప్పుడు మిరుమిట్లు గొలిపే తేజము ఇప్పుడు ఏమైపాయె? అందరు నా వలెనే ఆనందించండి. అంతే! కానీ నావంటి ప్రజ్ఞా పట్టుదలా ఎవ్వరికైనా గలదా?'

ఆరోజు నిండు సూర్యగ్రహణము. దానిచే అరణ్యమంతా చీకటి క్రమ్మెను. పక్షులన్నియును భయపడి గూళ్ళుచేరి, కీచు, కీచుమనుచుండెను. గబ్బిలములు, గుడ్లగూబలు మాత్రము కన్నులుతెరచి ఆనందించదొడగెను.

కారణమేమన,

*అందరి దుఃఖమే వాటికానందము!*
*అందరి ప్రకాశమే వాటికంధకారము!!*
*అందరి అంధకారమే వాటి ప్రకాశము!!!*

ఆ గుడ్లగూబ అమితానందముచే వళ్ళుమరచెను. గూటిలో గంతులువేయుచు నోరుతెరచి, అరచుచుండెను.

'మేల్కొనండి, లేవండి ఓ గుడ్లగూబ సోదరులారా!

మీరంతా ఇంకా మైమరచి ఉండతగునా? నే చేసిన మహత్కార్యము బోధపడలేదా? నన్ను తలపై ఎక్కించుకుని గంతులువేయరేమి?... ఈ తేజోవంతమగు ప్రచండగోళమును నల్లగాచేసినవాడను. దానిని లేకుండా చేసినవాడను నేనే. తెలిసినదా? ప్రపంచమంతయు చేయలేనిపని నేనొక్కడినే చేసితిని.'



పక్షులన్నియు ఈ మాటలుల విని నవ్వెను, గుడ్లగూబలు కూడా. దీనిచే ఆ గుడ్లగూబకు మరింత కోపము వచ్చెను. దానికి పిచ్చి యెత్తినట్లాయెను.

'మా వాండ్లలోకూడ నా కార్యశూరత్వము గూర్చి ప్రోత్సాహము ఉండగూడదా? మాబోటి యువకులపట్ల ముసలిముండాకొడుకులకు నిర్లక్ష్యం, హేళన ఉండుట సహజమే. ఎవరేమన్ననూ ఈ భయంకరమగు సూర్యగోళమును నాశనమొనరించినది, నేనని గుడ్లగూబల చరిత్రలో సువర్ణ అక్షరాలలో రాయబడునను సంగతి మరువవలదు'... అని మళ్ళీ, 'ఘూం...ఘూం' అని విజయనాదము చేయమొదలిడెను. కాని దాని కూత గొంతులోనే యిమిడిపోయెను. ఏలనన రొట్టెపెంక వలె నల్లబడిన ఆ సూర్యగోళము తిరిగి ఒకవైపునుండి మెరయసాగెను. దానిచే ఆ గుడ్లగూబ చిన్నపాటి హృదయము బాకుతో పొడిచినట్లాయెను.

దాని రెక్కలు వణకసాగెను. అది ఎలుగెత్తి ఇతర గుడ్లగూబలతో,

'ఇంకా చూస్తారేమి? ముందుకు నడవండి. మీ రెక్కలతోనే ఆ ప్రకాశమును కప్పివేయండి. నేను అప్పుడు దీనిని చీకటిలోకి తరిమివేసితిని. మళ్ళీ తిరిగి తలెత్తుచున్నది.'

చూస్తూ చూస్తూనే చీకటిపొరలు తెలిపోయి తిరగి సూర్యుడు యెప్పటివలెనే ప్రకాశించసాగెను. పక్షులన్నియును ఆనందముగా యెగురుచూ పాడదొడగెను. ఆ తేజముచే చీకట్లు కమ్మినట్లగుటచే గుడ్లగూబలు కళ్ళు మూసుకొనెను.

'ప్రపంచమున ప్రజ్ఞ, ప్రతిభలకు విలువలేకుండా అయినది.'

అని గుడ్లగూబ విలపించెను.

'సుందరమైన అంధకారలక్ష్మిని సాధించుటకై, నేనెంతయో పాటుబడితిని. కాని మా జాతివారే ద్రోహము చేసిరి. అట్టితరి నేనొక్కడ యేమి చేయగలను? యింకెంతైనా వెలుతురు రాని! అంతా ప్రకాశము నాశనము కాని! కానీ దానిచే కలుగు అనర్థమునకు నేనుమాత్రము బాధ్యుడను కాదు.' కన్నులు గట్టిగా మూసి గూటిలో అటూ ఇటూ తల్లడిల్లుచుండగా కొననుండి జారి అది చెట్టుక్రింద పడెను. దాని రెక్కలు, కాళ్ళు విరిగెను. ఒక గద్ద దానిని వెంబడే తన్నుకపోయెను. కాని చస్తూ గూడ అది యిట్లు అరచెను.

'కావలసినవారే నన్ను కిందికి తోసిరి. వారి మేలుకొరకు సాధింపనెంచిన ఆదర్శమే వారికి నచ్చలేదు. అందుకే వారు నాపై పగ సాధించిరి.

కాని నేను అమరుడను, సర్వత్రా అంధకార సామ్రాజ్యము స్థాపించవలెనను పవిత్రకార్యమున నా జీవితము అర్పించుచున్నాను.'

పక్షులు ఆనందముతో 'కిచ కిచ' అనెను. గుడ్లగూబలు తలలువాల్చెను. సూర్యుడు ఎప్పటివలెనే ప్రకాశించుచుండెను.

***

*(ఒక మరాఠీ కథననుసరించి)*

*ఆంధ్రకేసరి, సంపుటి 1, సంచిక 5, వృష-జ్యేష్ఠ*



# జాజితీగ

మరాఠీమూలం : ఆచార్య గోరె

"ఈ జాజితీగెను ఎట్లాగయినా, ఆ పొగడచెట్టుపైకి ఎక్కించాలె. నిజంగా జాజితీగ గనక పొగడచెట్టుపైకి ప్రాకితే ఎంత సొంపుగా ఉంటుంది." నేను నా మనస్సులో అనుకున్నాను. సువర్ణఛాయలీనె పసుపుపచ్చని పొగడపూలు, వానిమధ్య కలికి నవ్వులు ఒలకపోసినట్లుగా జాజిపూలు, ఒకదాని ఘుమఘుమ, మరొకదాని సుకుమారమగు సువాసన, పొగడచెట్టుయొక్క ఎత్తైన, బలమైన బాహువుల్లో సుకుమారమైన జాజితీవ, ముగ్ధకోమలివలె అటుయిటూ నడయాడుతుంటే నిజంగా ఆ దృశ్యం చూచితీరవలసిందేకాని, ఊహాకల్పన ఏమి చాలుతుంది వర్ణించడానికి? నేను ఎన్నోసార్లు ఆ తీగెను పొగడచెట్టుపైకి ప్రాకించడానికి ప్రయత్నం చేసాను. ముద్దుముద్దుగా ఉన్న ఆ సుకుమారమైన తీవెను కొత్తగా అత్తగారింటికి తీసుకపోయే పెండ్లిపడుచు మోస్తరు లాలిస్తూ, ఓదారుస్తూ, చేతితో నివురుతూ ఎంతో భద్రంగా దానిని పొగడచెట్టువరకు తీసుకుపోయాను. పొగడచెట్టు మొదలునంటుకోవడానికి అది ఎంతో సిగ్గిలింది. నేను ఆ తీగెకు నొప్పి కలగకుండా అక్కడక్కడ ప్రేమబంధములు (కట్లు) కల్పించుతూ అవసరములేని దగ్గర స్వేచ్ఛగా వదులుతూ, ఎంతో ప్రయత్నము మీదనే నా తీవెను పొగడచెట్టు మొదలుకు చుట్టిపెట్టాను.

ఒకవిధంగా నేను చేసినది చమత్కారపు పెండిలి అయినా అసహజంగా తనకు తానై వచ్చి ఆ పొగడచెట్టును చుట్టుకొన్నట్లుగా కనబడదొడగింది ఆ తీవ. రోజు నేను వెళ్ళి అసలు కొనలు వేస్తూ ఉన్న ఆ తీవెను పొగడచెట్టుపైకి ప్రాకించేవాణ్ణి. ఎప్పుడైతే ఆ రెంటి కలయికకు, ఇక ఎడబాటులేదని నాకు నిశ్చయం కలిగిందో, నా గుండెపైనుండి ఏదో బరువు దిగినట్టుగా అయింది. ఇక ఆ చెట్టుకింద కుర్చీ వేసుకొని అలసట తీర్చుకోవచ్చునని, ఆ చోటంతా శుభ్రపరచుకొన్నాను నేను. జాజికి సమీపంగానే ఎండిపోయి వంకర టింకరగా ఉన్న రేగుచెట్టు మొదలు మాత్రము ఒకటి ఉంది. అది కొసలు ఎండి ఎవరితోనో తన గోడు చెప్పుకుంటు ఉన్నట్టు వికారంగా ఉంది. ఆ మొదలు కూడా తీసివేయాలనే కోరిక కలిగింది నాకు. కాని 'ఉండనిత్తురు, గోడకు మేకు ఒకటి పాతి ఆ రెంటిమధ్య తాడొకటి

వేస్తే బట్టలు ఆరవేయడానికి ఉపయోగంగా ఉంటుంది' అని అడ్డువచ్చింది మా ఆవిడ. దానితో 'సరే! పోనివ్వు' అని ఆ రేగుమొదలును తీయకుండా వదలివేశాను.

ఆ తర్వాత ఏవో కొన్ని అవసరమగు పనులు ఉండడం వలన కొన్నాళ్ళ వరకు నాకా జాజితీవ వైపు చూడడానికే అవకాశం చిక్కలేదు. దాదాపు ఒక మాసంరోజులు ఈవిధంగానే గడిచాయి. ఆ రోజు నా బాదరబందీ వదలిపోవడం వలన సంతోషంగా కుర్చీ బైటికి తీసుకొని వచ్చి, దానిపై కూర్చొని నిమ్మళంగా సిగరెట్టు వెలిగించాను. నా మనస్సంతా కాబోయే నా కూతురు వివాహంపైన లగ్నమైఉంది.

ఆరోజే బొంబాయినుండి ఆ యువకుని లేఖ వచ్చి చేరింది నాకు. రాబోయే ఆదివారం తాను మిత్రులతో మా ఊరు రానున్నానని, అప్పుడు తప్పక మా ఇంటికి రాగలనని ఆతడు లేఖలో రాసియుండెను.

ఉత్తరము జదివి, సంతోషంగా నేను అటూయిటూ పచారు చేస్తూ అందమైన నా కూతుర్ని, కాబోయే నా అల్లుణ్ణి గూర్చి కమ్మని కలలు కనడంలో మునిగిపోయాను. యుక్తవయసు వచ్చిన నా కూతురుకు రూపము, సంపదలు కలిగిన ఆ యువకుణ్ణి నేను ఎన్నుకొనియుంటిని. మా ఇంట్లో ఎన్నోసార్లు సంతోషంగా వాళ్ళు కలుసుకున్నారు కూడా. కాని వివాహ విషయం మాత్రము నావరకే అట్టే పెట్టుకున్నాను నేను. కాని వచ్చే ఆదివారం ఎట్లాగూ వస్తాడుగా! అప్పుడు ఆ విషయం స్పష్టపరచక తప్పదని నాలో నేను అనుకున్నాను. నా ఆలోచనల్లో నేను మునిగి ఆటుయిటు తిరుగుతూ ఉన్నవాణ్ణి ఎందుకో జాజితీవ ముందుకు పోయాను. అది నా కన్నులబడేవరకు నా కాళ్ళు హఠాత్తుగా అగిపోయినాయి. ఆ దృశ్యం చూచి నా మనస్సు వికలమైపోయింది. ఎంతో శ్రమపడి పొగడచెట్టు పైకి ప్రాకించిన జాజితీవ పొగడచెట్టుతో మోము మాడ్చినట్టు నేలపై పడి ఉంది. అంతటితో ఆగక, ఆ దాపుననే ఎండి వంకరటింకరగా ఉన్న రేగు మొదలును పెనవేసుకొని సగంవరకు ఎగబ్రాకి సంతోషసూచకంగా ఒక తెల్లనిపువ్వు పూసి తన భాగ్యానికి తానే గర్వపడుతున్నట్లు మెల్లమెల్లగా తల ఊపుతుంది. ఇక నాకా వింతసంబంధాన్ని చూచేవరకు బలిమిగా రేగుచెట్టునుండి దానిని విడిపించాలనే కోరిక కలిగింది. ఇంతలో మా ఇంటిగేటు కిర్రున చప్పుడు కావడం వలన అటువైపు చూచాను నేను. నా కూతురు పుస్తకాలు చంకలో పెట్టుకొని, మా ఇంటిప్రక్కనే ఉండే ఓ వారాలబ్బాయితో నవ్వుతూ వస్తుంది. ఏమంత అందగాడు కాదు ఆ అబ్బాయి. అందగాడు కాకపోతేమానె చూచేవాళ్ళకు



వికారంగా కనబడతాడు కూడ. కాని నా కూతురు ఆయనతో నవ్వుతూ, మెడలు త్రిప్పుతూ అతనిలో ఒక భాగమైనట్టే నిశ్చింతగా లోనికివచ్చింది. ఇంతలో చెట్టుచాటున ఉన్న నేను కనిపించేవరకు నేనున్నానని తెలుసుకుని ఏదో తప్పిదము చేసినట్టు భయంతో లోనికి పరుగెత్తి పోయినపుడు జాజితీగ ప్రక్క నుండి ఉరికింది. ఒకేసారి నా కూతురు, ఎండిన వేరును పెనవేసుకున్న జాజితీగ నా కళ్ళల్లో మెరిసాయి. ఆ రెండు దృశ్యాలు నా గుండె తగిలిన వెనక నాబాధనెవరు వర్ణించగలరు?

నా చేతిలో ఉన్న ఉత్తరము గూడ నేలజారింది. నేను తెలుసుకోలేకపోయాను అప్పుడు.

***

*శోభ, సాహిత్య పత్రిక, ఏప్రిల్ 1947*

# అపోహ

అతి ప్రశాంతమగు సాయం సమయమది. పసుపు సముద్రము (ఎల్లో సీ) లో నుండి అమెరికను ఓడ వయ్యారంగా సాగిపోతుంది. వివిధ దేశాల ధనాఢ్యులతో నిండి వుంది ఆ ఓడ. సాగరమధ్యమందు గల ఏ అపరిచిత భూభాగాన్నో నెలవు చేసుకొన్న సముద్రపు పక్షులు అప్పుడప్పుడు గుంపులు గుంపులుగా వచ్చి ఓడ పైపైన తిరిగి అంతరిక్షములో మాయమవుతున్నాయి. ఆడి, ఆడి అలసిన సముద్రతరంగాలు తల్లి ఒడిలో విశ్రాంతి తీసుకొంటున్నాయి. పండుపండిన బంగారుముద్దలా దూరాన ఎక్కడో క్రుంగుతూ ఉన్న సూర్యుడు సముద్రంపైనుండి ఎంతో అందంగా కనపడుతున్నాడు. సంధ్యామనోహర దృశ్యాలు తిలకించడానికి కేబినుల నుండి బయటకు వచ్చిన ప్రయాణికులంతా డెక్కుపైన గుమిగూడి ఉన్నారు. వారిమధ్య ఒక పెద్దమనిషి నిలువబడి చుట్టూ మూగిన ప్రయాణికులతో వింతగా ఏదో ముచ్చటిస్తున్నాడు. అతని ఎడమచేతిలో చెక్కడపు పనిచేసిన ఒక అందమైన దంతపు పేటిక ఉంది. ఆ పెద్దమనిషి అమెరికాలోని ఓ ఫ్యాక్టరీ యజమాని. అతడు పేరుమోసిన గొప్ప శ్రీమంతుడు. అతనికి వివిధ దేశములలోని పురాతన నాణెములు సమకూర్చుట అనిన ఎంతో ఆనందము. ఆ ఆనందములో అతనికి ఆకలిదప్పులు కూడా ఏర్పడవు. అతడు సంపాదించిన నాణెములలో కొన్ని బ్రిటిష్ మ్యూజియమున సహితము లేవు.

డెక్కుపై మూగిన తోడి ప్రయాణికులంతా అతనిని ఒత్తిడి చేయడం వలన నాడా నాణెములను ప్రదర్శించడానికి ఒప్పుకున్నాడాయన. శ్రీమంతుడైన ఆ అమెరికన్ చేతిలో ఉన్న పేటిక నుండి ఒక నాణెము పైకి తీసి "మీకు తెలుసు గదా! క్లియోపాత్ర ఎంత చక్కనైనదో, అంత జిత్తులమారిదని - యిదిగో చూడండి! ఆ చరిత్ర ప్రసిద్ధమైన క్లియోపాత్ర కాలమునాటి నాణెము. రెండేళ్ళ క్రింద నేను ఈజిప్టుకు వెళ్ళినపుడు యిరువది ఏడువేల డాలర్లు వెచ్చించి దీనిని తీసుకొన్నాను." ఈ మాటలు చెప్పి అతను ఆ నాణెమును అచ్చట మూగిన వారిని చూడనిచ్చినాడు. ప్రతివాడు విస్మయపడుచు కన్నుల కరువు తీర ఆ నాణెమును తిప్పితిప్పి చూచి ప్రక్కవానికి



అందించదొడగినాడు. ఇట్లా అది ప్రతివాని చేతిలో పడి అందరు చూచిన తరువాత మరల ఆ అమెరికన్ శ్రీమంతుని చేతిలోకి వచ్చి చేరింది. ఇట్లాతడు సేకరించిన వివిధ నాణములను అక్కడ సమావేశమైన వారందరికి చూపెట్టాడు. అవన్నియు సాధారణముగా లభించనివి అత్యంత విలువగలవియునై యుండెను. ఆ నాణెములు చూపెట్టిన తరువాత ఆ అమెరికన్ దంతపేటిక అడుగుభాగములో కడుభద్రంగా దాచిపెట్టబడిన మరోనాణెమును ఎంతో విలువైనదన్నట్టుగా పైకి తీసి "ఇక ఇది ఒకటి మిగిలి వుంది ఎంత లేదన్న పదివేల ఏండ్లక్రిందటి నాణెమిది. ప్రపంచమంతటిలో దీనిని బోలిన నాణెము ఒకటి మిగిలి ఉంది. నాలుగేళ్ళ క్రితం జావాకు పోయినపుడు ఇరువదివేల డాలర్లకు దీనిని పుచ్చుకున్నాను" అంటూ ఆ నాణెమును ఓ పెద్దమనిషి చేతికందిచ్చి అందరికి చూపమని సంజ్ఞ చేసాడు. చుట్టూ మూగిన వాళ్ళంతా ఆ నాణెమును ఎంతో పరీక్షగా చూసారు. ఇట్లా ఆ అపూర్వ నాణెమును చూచుటలో ఎంతో ప్రొద్దు గడిచింది. ఆ రోజు నాణెములు చూపెట్టినందుకు చుట్టుమూగిన వాళ్ళంతా ఆ అమెరికన్ శ్రీమంతుణ్ణి ఎంతో ప్రశంసించినారు. శ్రీమంతుడు నింపాదిగా తన నాణెములన్నింటిని దంతపేటికలో అమర్చుకుంటూ "అయ్యో నా జావాప్రాంతపు నాణెము ఏమైనట్టు" అని వెర్రివాడి మోస్తరు అందరిముఖాలు చూడదొడగాడు.

అక్కడ ఉన్నవాళ్ళంతా తెల్లబోయారు. ఇప్పుడిప్పుడే మా చేతిలోకి వచ్చిన నాణెము ఏమైనట్టు? వాళ్ళంతా ఎంతో శ్రద్ధగా డెక్కంతా కలియవెదికారు, కాని ఆ నాణెము ఎక్కడ కనిపించలేదు. పాపము ఆ అమెరికన్ వెర్రిమొఖము వేశాడు. అతనికేమీ చేయడానికి తోచక తుదకతడు అక్కడ చేరిన వారందరిని ఉద్దేశించి "మిత్రులంతా నన్ను క్షమిస్తారనుకుంటాను. పురాతన నాణములనిన నాకెంతో యిది. ప్రస్తుతము పోయిన నాణెము ఎంత విలువైనదో మీకు తెలుసుకదా? ఒకవేళ నాచుట్టు చేరిన మిత్రులు కోపపడితే నేను ఏమి జవాబు చెప్పలేను. కాని దయచేసి ఒకసారి నన్ను జేబులు తడమనిస్తారనుకొంటాను" అన్నాడు. అమెరికన్ ఈమాట అనడంతోనే అక్కడివాళ్ళంతా "మాకేమి ఆక్షేపణ లేదు. వెతుక్కోవచ్చు" అని నిర్మొహమాటంగా జవాబు ఇచ్చారు. ఆ అమెరికన్ శ్రీమంతుడు అక్కడున్న ప్రేక్షకుల జేబులన్నీ తడవి చూశాడు. కానీ ఒక ఆంగ్లేయ బ్యాంకరు మాత్రము అందుకు ఒప్పుకోలేదు. ఆ ఆంగ్లేయుడు స్వదేశములో గొప్ప పేరుప్రతిష్ఠలు గల వ్యక్తి. అతడు జేబులు తడవ నిరాకరించే వరకు అక్కడ మూగిన వాళ్ళ దృక్కులన్ని అతనిపై నిలిచాయి.

"ఇది నా జాతికి అగౌరవం. యిందుకు నేను ఒప్పుకోలేను" అన్నాడు ఆ ఆంగ్లేయుడు.

"అయితే దయచేసి మీరే ఇచ్చివేయండి."

"అయితే మీ నాణెమును నేను గ్రహించానని మీరు అనుకొంటున్నారా?"

"నేను నిశ్చయంగా చెప్పలేను కానీ మీరు అనుమానానికి తావు కల్పిస్తున్నారు."

"నేను నాదేశం, నా జాతియొక్క గౌరవములపై ఒట్టు పెట్టుకొని మరోమారు చెప్పుతున్నాను. నేను ఆ నాణెమును దొంగిలించలేదు. చెప్పగలిగిందేదో చెప్పివేశాను. యిక మీ యిష్టం" అంటూ ఆ ఆంగ్లేయుడు విసవిస అక్కడినుంచి వెళ్ళిపోయాడు. అప్పటికే చాలా సమయం గడిచింది. నాణెమును పోగొట్టుకొన్న ఆ అమెరికన్‌పై జాలిదలుస్తు ప్రతివొక్కరు తమ తమ కేబినులోనికి వెళ్ళిపోయారు. అందరు ఆనాడు జరిగిన దానికి చింతిస్తూ ఆంగ్లేయ బ్యాంకరు యొక్క విచిత్ర ప్రవర్తనకు ఆశ్చర్యచకితులైయుండిరి.

రెండోరోజు ఉదయం ఎనిమిదిగంటలకు ఆ ఓడపైని ప్రయాణికులందరు ఉపాహారం నిమిత్తం ఓడమధ్య హాలులో గుమిగూడారు. నాణెముల యజమాని అతివిచారముతో ఉండెను. అతడు ఎవరితోనూ మాటాడక తన టేబిలు వద్ద కూర్చుని ఉపాహారము తీసుకొనుచుండెను. ఇంతలో ఓడపైని పనిచేయు సరంగు ఒకడు అతని చెవిలోనేదో గుసగుస చెప్పి అతని చేతిలోనేదియో ఉంచెను. అమెరికన్ ఒక్క పెట్టున కేకపెట్టి తన సంతోషాశ్చర్యముల వెలిబుచ్చెను. అందరు వులికిపడి అతనివైపు సంభ్రమాశ్చర్యములతో చూడసాగిరి. నాణెముల యజమాని ముఖమునుండి ఆనందముట్టిపడుచుండెను. తుదకు అమెరికన్ తన తోడి ప్రయాణికులవైపు తిరిగి "నా పోయిన నాణెము డెక్కుపై ఒడ్డున ఆడు కుర్రవానికి దొరికినది" అని ఆ నాణెమును కుర్రవానిని చూపెట్టెను. అక్కడ కూడిన వారంతా పెద్దగా హర్షధ్వనులు చేసిరి. ఇంతలో అమెరికన్ శ్రీమంతుడు ఆంగ్లేబ్యాంకరు వద్దకు పోయి, "అయ్యా నన్ను క్షమించండి నిన్న రాత్రి నేను మీ విషయం లేనిపోని అపోహపడ్డాను. కేవలం అనుమానమే కాకుండా ఆ నాణెమును మీరే సంగ్రహించినట్టు విశ్వసించినాను. నా అపోహకు మీరు నన్ను మన్నిస్తారనుకుంటాను. కాని ఒక్క విషయం నాకు యింకా అబోధకంగా ఉంది. మీరు నాణెమును తీసుకోనపుడు అందరు వెతకనిచ్చినట్టు మీరు ఏల సంసిద్ధులు కాకపోతిరి?" అమెరికన్ ఈమాట అనేవరకు అక్కడ మూగిన ప్రేక్షకుల దృక్కులన్నీ ఆ ఆంగ్లేయ బ్యాంకరుపై నిలిచాయి.



చేతిలోని సిగరెట్టు బూడిదను రాలుస్తూ ఆ ఆంగ్లేయుడు నలువైపుల చూచాడు. అందరి ముఖాలు అతని విచిత్ర ప్రవర్తనకు కారణమేమిటో తెలుసుకోవడానికి ఆతురత పడుతున్నాయి. ఆంగ్లేయుడు తన మోకాళ్ళపై చేతులు వేసి పెద్దగా నవ్వి, "కొంచెం ఆగండి" అని తన వేస్టుకోటు జేబులోనుండి ఒక నాణెమును అమెరికన్ దేశస్తునకిచ్చి, "ప్రపంచములో మరోటిలేదని చెప్పితిరే యిదిగో అలాంటిదే మరొక నాణెము. నిన్న సాయంత్రమిది నా జేబులో ఉంది. అప్పుడు కనుక మిమ్మల్ని జేబులు తడమనిస్తే నాస్థితి ఏమయ్యేది? ఇది నా స్వంతమని నేనెంత చెప్పినా మీరెవరయినా నమ్మియుండేవారా?

నేను మాత్రము నిష్కారణంగా దోషిగా నిర్ణయింపబడేవాడిని. ఇక నేను ఆ సమయాన జేబులు తడమనివ్వలేదంటే దానిలో విచిత్రమేముందో మీరే ఆలోచించండి" అని వెకిలిగా నవ్వుతూ అక్కడున్న వాళ్ళ మొహాలవైపు కుతూహలంగా చూచాడు. చుట్టూ ఉన్నవాళ్ళు ఆశ్చర్యంతో నోరుతెరిచారు.

***

*మూలం: ఇంగ్లీషు*

*'శోభ' 1947 జూలై*

# కాళోజీ కథల మంజూష

అన్ని సామాజిక సేవల్లాగే రచనలు చేయడం గూడా ఒక విధంగా సామాజిక సేవయేనని విజ్ఞులు చెప్తుతారు. ఒక ఉత్తరం, స్కెచ్, కథ, నవల, వ్యాఖ్యానం కవిత్వం లేదా వీటి విలువల్ని తూచే విమర్శ-ఏదైనా కావొచ్చు, ఆ ప్రక్రియ సామాజిక సేవలో భాగమే!

ఒకటి రెండు సంఘటల్ని అక్షరాల్లో చిత్రించి రచయిత తాను ప్రత్యక్షంగా కనిపించకుండానే తన అభిప్రాయాన్నీ, అభిమతాన్నీ తెలియజేసినప్పుడు కథ అవుతుంది. ఒక పెద్ద కాన్వాసును తీసుకుని ఒక కాలంలో జరిగిన అనేక సంఘటల్నీ, ఉద్యమాల్నీ, మార్పుల్నీ, క్రోడీకరించి కథనల్లుతూ తన అభిప్రాయాల్నీ, తాను నమ్మిన సిద్ధాంతాల్నీ తాను పయనించిన తాత్వికలోకాల్ని గురించి చెప్పి, చూప గలిగే రచనను నవలగా చెప్పుకోవచ్చు. వీటిల్లో చారిత్రక, సాంఘికపరమైన, సాంకేతిక పరమైన సమాచారాంశాలుంటాయి. ఇంకా అనేకమైన అంశాలు చోటుచేసుకోవచ్చును కూడా.

సుమారు ఒక శతాబ్దకాలాన్ని చారిత్రకంగా, రాజకీయంగా, సామాజికంగా ప్రభావితం చేసిన కాళోజీ నారాయణరావు (1914-2002) తెలంగాణ జాతిపిత లాంటివారు. వీరి జీవ కాలమంతా ఉద్యమాల ప్రవాహమే! ఈ ప్రవాహం అనేకానేక కోణాల్లో, అనేక రూపాల్లో సాగింది. వాటిలో రచనా వ్యాసంగమూ వుంది. కథ, కవిత్వం అనే రెండు ప్రక్రియల్లో నడిచింది వీరి వ్యాసంగం.

ప్రజా సంబంధాలనుండి, ప్రజా ఉద్యమాలు నడిపినవారు గనుక ఆ ఉద్యమాల ప్రచారానికి ఎక్కువగా కవిత్వాన్ని ఒక సాధనంగా చేసుకున్న వారు గనుక కాళోజీ కథకులుగా కంటే 'ప్రజాకవి'గానే ప్రసిద్ధులయినారు. కథకులుగా కాళోజీ రాసింది రాసిలో తక్కువే అయినా వాసిలో ఎక్కువేననడానికి నిదర్శనం ఆనాడు - అణాగ్రంథమాల తన 24వ ప్రచురణగా 'కాళోజీకథలు'ను, 2000 సంవత్సరంలో వరవరరావు గారు, ఇటీవల 'కాళోజీ ఫౌండేషన్' పక్షాన 'కాళోజీ కథలు' ప్రచురించడం జరిగింది. ఈ కథలకు ముందు మాట రాస్తూ చివరగా అన్న మాటలు తెలుగు వాళ్ళంతా గుర్తుంచుకోవల్సినవిగా వున్నాయి. "కాళోజీ తెలుగుజాతి 87 ఏళ్ళ సంచలనజీవితానికి నిలువుటద్దం. తెలుగుజాతి అన్నపుడు - అది ఆంధ్రుల



ఆత్మగౌరవం అనే ఒక పడికట్టు మాట వంటిదికాదు. కుల, లింగ, మత, వర్గ ప్రాంత వివక్షకు గురయి, పీడనకు అణచివేతకు, దోపిడీకి వ్యతిరేకంగా, బానిస వ్యవస్థలకు స్పార్టకస్‌వలె వ్యతిరేకంగా, 'నీ బాంచెన్ దొరా' వ్యవస్థకు వ్యతిరేకంగా, తెలంగాణ కట్టుబానిసవలె, ఆకాశంలో గద్దకు వ్యతిరేకంగా తల్లికోడివలె, నిర్నిద్రపోరాటం చేస్తున్న కాళోజీ మన కళ్ళముందు నడుస్తున్న చరిత్ర".

54 పేజీల చిన్న సంపుటి - "కాళోజీ కథలు". ఇందులో ఎనిమిది కాళోజీ స్వంత కథలు, ఒక మరాఠీ కథకు అనుసరణ, రెండు మరాఠీ కథల అనువాదాలు, ఒక ఇంగ్లీషు కథకు అనువాదం ఉన్నాయి.

"భూతదయ" (కథ)లో ఒక గుడి ప్రాంగణంలో వోరోజు ఎవరో పసికూనను కని వదిలేసి వెళ్ళిపోతారు. పాపేడుస్తుంటే జనంచుట్టూ మూగుతారు కాని ఎవరూ ఆ పాపను ముట్టుకోరు. ఒక రక్షణాధికారి అక్కడికొచ్చి పాపనుచూసి ఎవరైనా ఆదుకొండని ఎంత అభ్యర్థించినా ఎవరూ ముందుకురారు. చివరికి ఒక క్రైస్తవ మతగురువు పాపను పెంచుకోవడానికి ముందుకొస్తాడు.

అదే గుడిప్రాంగణంలో మరొకరోజు ఒక విగ్రహం పడి ఉంటుంది. జనం పోగవుతారు. భక్తితో దండాలు పెట్టుకుంటారు. ఇంతలో ఒక శాస్త్రులవారు జనాన్ని పక్కకుతోసుకుంటూ మూర్తిని సమీపించి భక్తితో దాన్ని గుండెలకుహత్తుకుంటాడు. భక్తిగీతాలు ఆలపించడం ప్రారంభిస్తారు. జనం స్పందించి డబ్బు ప్రోగుచేసి ఆ మూర్తికి ఆలయం కడతారు. ప్రాణమున్న అనాథ శిశువును పట్టించుకోని జనం రాతి విగ్రహానికి మాత్రం నీరాజనం పడతారు. ఇదీ లోకంపోకడని చెప్పడమే కథలోని ఉద్దేశ్యం. ఇంతకూ ఆ రాతివిగ్రహం దేవాలయ ప్రాంగణంలోకి ఎట్లా వొచ్చిందో కథచదివిన అందరికీ ఇట్టే అర్థమైపోతుంది.

మరొక కథ 'మనమేనయం'లో రెండెడ్ల మధ్య సంభాషణ. జంతుసంరక్షణ సమితివారు ఒక ఉత్సవం ఏర్పాటు చేసి అందులో అనేక జంతువుల్ని అలంకరించి ఊరేగింపు చేస్తారు. ఒకరైతు తన రెండెడ్లను గూడ ఉత్సవంలో పాల్గొనేందుకు తీసుకెళతాడు. ఉత్సవం రోజు తమకు పనిలేకపోవడం వల్ల ఎడ్లు సంతోషిస్తాయి. పరస్పరం మాట్లాడుకుంటూ జంతుసంరక్షణ సమితిని స్థాపించి నిర్వహించే సంపన్న కుటుంబీకులకు జంతువుల గురించి ఏమీ తెలియదని చెప్పుకుంటూ, ఇంతగా హడావిడి చేసే ఈ పెద్దమనుషులు తోటి మానవుల్ని మాత్రం జంతువులకంటే హీనంగా చూస్తారని, మనుషుల కంటే మనమే నయమని అభిప్రాయపడతాయి. సంపన్నులు చేసే పనుల్లో డొల్లతనం తప్ప మరేదీ లేదని తెలియజెప్పడం కథ ఉద్దేశ్యం.

'తెలియక ప్రేమ తెలిసి ద్వేషం' కథ ఆలోచింపజేసేది. ఎంతో తాత్వికత ఉంది కథలో, భారత స్వాతంత్ర్య సంగ్రామం రోజుల్లో అనేక ఉద్యమాలు వచ్చాయి. స్వాతంత్ర్యానికి కొంచెం ముందు రోజుల్లో కాంగ్రెసువారు ప్రముఖంగా నడిపిన 'హరిజనోద్ధరణ ముఖ్యమైనది. ఉద్యమంలో హరిజనుల్ని దేవాలయ ప్రవేశం గావించడం ఒక కార్యక్రమంగా పెట్టుకున్నారు ఉద్యమనాయకులు. కానీ దేవాలయాలన్నీ, హిందుత్వాన్ని అడ్డుపెట్టుకొని బతుకుతున్న అగ్రకులాలవాళ్ళు, ముఖ్యంగా బ్రాహ్మణులు ఊర్కుంటారా? ప్రతిఘటించడం జరిగింది. హరిజనులూ, బ్రాహ్మణులు కొట్లాడుకొన్నారు. ఘర్షణలో ఒక హరిజనుడు-బాగా దెబ్బలు తగిలి, ఒక బ్రాహ్మణుడు - తల తెగి మరణిస్తారు. ఇరువురి ప్రాణాల్ని యమదూతలు లాక్కెళ్ళుతూ మధ్యలో ఆగుతారు. అప్పుడు రెండు ప్రాణాలమధ్య సంభాషణ ఎంతో ప్రేమతో, ఆత్మీయతతో జరిగింది. ఒకరి వివరాల్ని ఒకరు అడిగి తెల్సుకుంటారు. ఇద్దరూ ఆ దేవాలయంలో హరిజన ప్రవేశం ఘర్షణలో ప్రాణాలు పోగొట్టుకున్నట్లు, అందునా ఆరెండు ప్రాణాలే ఒకర్నొకరు చంపుకున్నట్లు తెల్సుకుని, అప్పటిదాకా ఒకరిపై ఒకరు కురిపించుకున్న ప్రేమను ఒక్కసారిగా మరచిపోయి, పరస్పరం దూషించుకోవడం ప్రారంభిస్తారు. ఎవరేమిటో తెలియనంతవరకు ఏ ద్వేషమూ లేదు. తెలియగానే కోపం, ద్వేషం పెల్లుబికి శత్రుమూకలుగా మారడం-కథ సారాంశం.

'గుర్తింపు', నామకరణం వల్లనే అన్ని చిక్కులు, అనాదిగా జరుగుతున్నదిదే. కులాలకూ, వర్గాలకూ, ప్రాంతాలకూ, మతాలకూ అతీతంగా మనిషి ఉండగలిగితే అంతటా శాంతియే, కాని ఏదీ? ఇది చెప్పడమే, ఆలోచింపచేయడమే, కాళోజీ ఉద్దేశ్యం.

మరోకథ 'లంకాపునరుద్ధరణ'. ఇది చరిత్ర గమనం ఎట్లా ఉంటుందో తెలియజేసేది. సార్వకాలీనమైనది. కానైతే రామాయణంలోని చివరి ఘట్టమేకాని, పురాణగాథేకాని, ఇది నిన్న జరిగిన యుద్ధానికీ వర్తిస్తుంది. యుద్ధానంతర పరిస్థితులను చెప్పుతుంది. ఈ కథ చదివితే ఇరాన్-ఇరాక్ యుద్ధం గుర్తొస్తుంది. బంగ్లాదేశ్ విమోచన యుద్ధం గుర్తొస్తుంది. మళ్ళీ నిన్నటి అఫ్గాన్, ఇరాన్‌లో జరిగిన మారణ కాండలూ గుర్తొస్తాయి. కథలో రావణ సంహారణ పిదప లంకకు ఎవరిని అధిపతిని చేయాలనే సంశయంలో రాముడు, అతని అనుయాయులు ఆలోచనలో పడి, విభీషణుడు అప్పుడే అధికారం చేపట్టే పరిస్థితిలేదని లంకను, వానర



ప్రముఖులకు అప్పజెప్పుతారు. వానరులు కొల్లగొడుతారు. అనేక మూకల దోపిడీ దౌర్జన్యం జరుగుతుంది. ఈ పరిస్థితిని విభీషణుడు రాముడి దృష్టికి తేగానే, విచారణ జరిపిస్తాడు రాముడు. ఇదంతా మైరావణాది రాక్షసుల కుట్ర అనీ, లంక ప్రశాంతంగానే ఉందనీ వానరులు వాదిస్తారు. కాని, లంక పరిస్థితి ఘోరంగా ఉందని, స్వయంగా గుర్తించిన విభీషణుడు మళ్ళీ రాముడి దృష్టికి తేవడంవల్ల యిక తప్పదనుకున్న కోపమోగాని తానే స్వయంగా వెళ్ళి, లంక పరిస్థితుల్ని చక్కబరచి, విభీషణుడికి పట్టం కడతాడు రాముడు. ఇదీ కథ. ఈ కథ చదివితే మనకు వెంటనే యావత్ భారతదేశ పరిస్థితులూ, 1948 సెప్టెంబర్ 17 హైదరాబాద్ రాష్ట్ర పరిస్థితులు గుర్తుకొస్తాయి.

'ఆగష్టు పదిహేను' కథలో మనదేశ స్వాతంత్ర్యంకోసం గాంధీతోపాటు ఎందరో కాంగ్రెస్ నాయకులు ఎన్నో త్యాగాలు చేయడం (ఇతర పార్టీలవాళ్ళూ చేసినారు) స్వాతంత్ర్యం రాగానే త్యాగమూర్తుల్ని పక్కకునెట్టి కాంగ్రెస్‌లోని స్వార్థపరులైన నాయకులు తమ అనుయాయులు అసమర్థులైనా వారికే అనేక స్థానాల్లో అధికారాలు కట్టబెట్టి తమ పెత్తనం చెలాయిస్తూ వచ్చినారనే నగ్నసత్యాన్ని చమత్కరించడం జరిగింది.

'రెండు గింజలు' అనే కథలో నిరాశావాదం ఆశావాదాలలో మనుగడకు "ఏదిమంచి చేస్తుంది", "ఏది చెడు చేస్తుంది" అనే విషయాన్ని రెండు గింజల ప్రవర్తన సంభాషణల ద్వారా చెప్పడం జరిగింది. 'అనుభవంలేని ఆందోళన' అనే కథలో చీకట్లో కళ్ళు తెరిచిన గుడ్లగూబ వెలుగు కిరణాల్ని ఒక ఉపద్రవంగా ఎంచి గోలపెడుతుంది. గ్రహణం పట్టి సూర్యుడు కనిపించకపోతే అది తన ప్రతిభ వల్లేనని గంతులేస్తుంది. తన జాతి పక్షులూ, ఇతర పక్షులూ తనను అందలమెక్కించాలని కోరుతుంది. కాని, ఏపక్షీ దాన్ని ఖతారు చేయదు. అన్ని పక్షుల్ని తిడుతున్న గుడ్లగూబకు గ్రహణం విడిచిన సూర్యుడు మళ్ళీ ప్రకాశవంతంగా కనిపించగానే భంగపడి, భయంతో గూటినుండి కిందపడిపోతుంది. మూర్ఖుల మనస్తత్వానికి అద్దంపట్టే కథ ఇది. మరాఠీ కథకు అనుసరణ ఈ కథ.

'జాజితీగ' అనే కథ మరాఠీ కథకు అనువాదం. తల్లిదండ్రులు తమ పిల్లల విషయంలో పెంచుకున్న ఆశలూ, పిల్లల అభిరుచుల్ని తెలియజేసే కథ ఇది. ఒక తండ్రి తన కూతురుకు ఒక చక్కని సంబంధం తీసుకొస్తాడు. కాని కూతురు మాత్రం తమదగ్గర వారాలు చేసుకుని చదువుకునే అబ్బాయిని ప్రేమిస్తుంది. అతడితోనే జీవితాన్ని పంచుకోవాలని, సన్నిహితంగా ప్రవర్తిస్తుంది. ఇది గమనించిన తండ్రి

నిరుత్తరుడవుతాడు. ఈ సన్నివేశం జాజితీగను పొగడచెట్టుకు పాకించాలనుకుంటే, జాజితీగ మాత్రం ఎండిపోయిన రేగుమొద్దును అల్లుకున్న తీరును చాటుతుంది. ప్రకృతికున్న ప్రేమతత్వం ఎంతటి మహిమాన్వితమైందో, అనిర్వచనీయమైందో అలవోకగా, సున్నితంగా, నిరలంకారంగా వివరిస్తుందీకథ.

'అపోహ' అనే కథ ఆంగ్లానువాదం. ఇతివృత్తం చిన్నదే. నాణాలను సేకరించే అతడు ఓడలో ప్రయాణం చేస్తున్నపుడు తోటి ప్రయాణీకులకు తాను సేకరించినవి చూపిస్తూ ఒక అరుదైన నాణాన్ని పోగొట్టుకుంటాడు. సేకర్త తన నాణెం కోసం అందరి జేబులూ వెదుకుతాడు. ఒక ఇంగ్లీషు జెంటిల్మెన్ తన జేబును వెదకనీయడు. అట్లా వెదికితే 'ఘనతవహించిన తన దేశానికే పరువు నష్టం' అని తన క్యాబిన్‌లోకి వెళ్ళిపోతాడు. మరునాడు ఆ అరుదైన నాణం ఒక పిల్లవాడికి దొరికితే దాన్ని తెచ్చి పోగొట్టుకున్న అతడికి ఇస్తాడు. తన నాణెం లభ్యమైన విషయాన్ని ఇంగ్లీషు జెంటిల్మెన్‌కు నాణేల సేకర్త చెప్తూనే, తనను వెదకనీయని కారణం అడుగుతాడు. అప్పుడా జెంటిల్మెన్, నాణేల సేకర్త పోగొట్టుకున్న అరుదైన నాణెం, వంటిదే తన దగ్గర కూడా ఉందనీ, వెదికితే కనిపించిన నాణెమే సేకర్తదనుకుని శంకించే అవకాశముండి, తాను దొంగగా ముద్రపడే అవకాశముంది గనుక, తన జేబుల్ని వెదకనీయలేదంటాడు. కథ అనువాదంలో ఎంతో సహజత్వం చోటుచేసుకుంది.

'విభూతి లేక ఫేస్‌పౌడర్' అనే కథ సెటైర్. వ్యంగ్యంతో కూడుకుని పాఠకుల్ని బాగా నవ్విస్తూ సంస్కరింపజూస్తుంది.

ఈ సంపుటిలోని కథలు కొన్ని పూర్వపులాటిన్ అమెరికన్ కథల్లాగే ఉన్నాయి. పశుపక్ష్యాదులు పాత్రలై జీవిత సత్యాల్ని వెల్లడిస్తాయి. మన సాహిత్యంలోని పంచతంత్ర కథల్లాగా కూడా అనిపిస్తాయి. దివాంధ, జాజితీగె, కొసమెరుపు అనే మూడు కథలు-అనువాదాలే అయినా, శీర్షికలతో సహా రచయిత స్వంతకథల్లాగే తోస్తాయి. వీటిలో కాళోజీ అనువాదనైపుణ్యం గోచరమౌతుంది.

ఒకవేళ కాళోజీ కథలు, నవలలు రాయడంపై దృష్టి సారించిఉంటే ఎన్నో విలువైన రచనలు సృజింపబడేవి. కాని ప్రజా ఉద్యమాల్లో తలమునకలైన కాళోజీకి సమయమేది?

తెలుగు సంస్కరణ, మార్పు, సమతాదృక్పథం, ఆదర్శం వంటి విలువలకు తావిచ్చిన కథా సాహిత్యంలో కాళోజీ రచించిన ఈ కొన్ని కథలూ ఆణిముత్యాలని చెప్పవచ్చు. ప్రతి తెలుగు సాహితీ పిపాసి చదివి భద్రపరచుకోదగిన సంపుటియిది.

– **వి.ఆర్. విద్యార్థి**, (వీర తెలంగాణ సౌజన్యంతో)